# త్రైత సిద్ధాంత

## ఆధ్యాత్మిక ఘంటు




రచయిత : త్రిమత ఏకైక గురువు

ఆధ్యాత్మిక సామ్రాజ్య చక్రవర్తి, శతాధిక గ్రంథకర్త

ఇందూ జ్ఞాన ధర్మప్రదాత, సంచలనాత్మక రచయిత, త్రైత సిద్ధాంత ఆదికర్త

**శ్రీ.శ్రీ.శ్రీ. ఆచార్య ప్రబోధానంద యోగీశ్వరులు**





అనురచన

**యోహాన్**



www.thraithashakam.org







# త్రైత సిద్ధాంత

## ఆధ్యాత్మిక ఘంటు


రచన

అర్ధ శతాధిక గ్రంథకర్త, ఇందూ (హిందూ) ధర్మప్రదాత,

సంచలనాత్మక రచయిత, త్రైత సిద్ధాంత ఆదికర్త

**శ్రీశ్రీశ్రీ ఆచార్య ప్రబోధానంద యోగీశ్వరులు**

అనురచన

**యోహాన్**






ప్రచురించిన వారు

**ఇందూ జ్ఞానవేదిక**

(Regd.No. : 168/2004)

త్రైత శకము-36 ప్రథమ ముద్రణ : సం|| 2014

ప్రతులు : 1000 వెల : **60/-**

# యోగీశ్వరుల వారి సంచలనాత్మక రచనలు

## ఇందూ జ్ఞానవేదిక ప్రచురణలు

1) త్రైత సిద్ధాంత భగవద్గీత.
2) ఆధ్యాత్మిక ప్రశ్నలు-జవాబులు.
3) ధర్మము-అధర్మము.
4) ఇందుత్వమును కాపాడుదాం.
5) యజ్ఞములు (నిజమా-అబద్ధమా?).
6) దయ్యాల-భూతాల యదార్థసంఘటనలు.
7) సత్యాన్వేషి కథ.
8) మంత్రము-మహిమ (నిజమా-అబద్ధమా)
9) శ్రీకృష్ణుడు దేవుడా, భగవంతుడా.
10) గీతా పరిచయము (తెలుగు,ఇంగ్లీషు)
11) కలియుగము (ఎప్పటికీ యుగాంతము కాదు).
12) జనన మరణ సిద్ధాంతము.
13) మరణ రహస్యము.
14) పునర్జన్మ రహస్యము.
15) త్రైతాకార రహస్యము (త్రైతాకార బెర్ముడా)
16) కథల జ్ఞానము.
17) సామెతల జ్ఞానము.
18) పొడుపు కథల జ్ఞానము.
19) తత్త్వముల జ్ఞానము.
20) తిట్ల జ్ఞానము-దీవెనల అజ్ఞానము.
21) గీతం-గీత (పాటల జ్ఞానము).
22) తత్త్వార్థ బొమ్మల జ్ఞానము.
23) దేవాలయ రహస్యములు. (తెలుగు,ఇంగ్లీషు,కన్నడ)
24) ఇందూ సాంప్రదాయములు.
25) మన పండుగలు (ఎలా చేయాలో తెలుసా?)
26) జ్యోతిష్యశాస్త్రము (శాస్త్రమా-అశాస్త్రమా?)
27) వాస్తు శాస్త్రము (సత్యమా-అసత్యమా)
28) తల్లి తండ్రి.
29) గురు ప్రార్థనామంజరి.
30) త్రైతారాధన.
31) సమాధి.
32) ప్రబోధ.
33) సుబోధ.
34) ప్రసిద్ధి బోధ.
35) సుప్రసిద్ధి బోధ.
36) సిలువ దేవుడా?
37) మతాతీత దేవుని మార్గము.
38) సృష్టికర్తకోడ్-963.
39) మతము-పథము.
40) ప్రబోధానందం నాటికలు.
41) ఇందువు క్రైస్తవుడా?
42) త్రిత్వమా? ద్విత్వమా?
43) నిగూఢ తత్త్వార్థ బోధిని.
44) ఆత్మలింగార్థము.
45) నాస్తికులు-ఆస్తికులు.
46) హేతువాదము-ప్రతివాదము.
47) గుత్తా.
48) ప్రబోధ తరంగాలు.
49) త్రైత సిద్ధాంతము.
50) రూపము మారిన గీత.
51) ఉపనిషత్‌లలో లోపాలు.
52) బైబిల్‌లో (ఇందు) పవిత్ర వాక్యాలు.
53) ఖురాన్‌లో (ఇందు) పవిత్ర వాక్యాలు.
54) ద్రావిడ బ్రాహ్మణ.
55) తీర్పు.
56) కర్మ పత్రము.
57) ప్రవక్తలు ఎవరు?
58) ప్రథమ దైవ గ్రంథము భగవద్గీత.
59) ధర్మశాస్త్రము ఏది?
60. మత మార్పిడి దైవద్రోహము.
61) త్రైతశక పంచాంగము.

# యోగీశ్వరుల వారి సంచలనాత్మక ప్రసంగాలు

DVD'S

01. సంతకము.
02. సాంప్రదాయము.
03. త్రైతశకము.
04. కోడిపుంజు-పాదరసము.
05. యుగము-యోగము
06. నైజం-సహజం.
07. ఆత్మకు వెంట్రుక గుర్తు.
08. పైత్యం-సైత్యం.
09. శైవము-వైష్ణవము.
10. ఇందూమహాసముద్రము.
11. సృష్టి-సృష్టికర్త.
12. కాయ-పండు-కాయ.
13. జ్ఞానము-విజ్ఞానము.
14. వార-మాస-వత్సర.
15. సేకూవలి-కూలిసేవా.
16. ధర్మము-అధర్మము.
17. ఏక్‌నిరంజన్-అలక్‌నిరంజన్.
18. గురువులేని విద్య గ్రుడ్డివిద్య.
19. బట్టతల.
20. భగవంతుడు.
21. ద్రావిడులు-ఆర్యులు.
22. ప్రభువు-ప్రభుత్వం.
23. భూతం-మహాభూతం.
24. ప్రభు-ప్రజ.
25. యాదవ్.
26. పుస్తకము-గ్రంథము.
27. వెలుగుబంటు.
28. ప్రకృతి-వికృతి.
29. మాట-మందు.
30. ఏకత-ఏకాగ్రత.
31. హరికాలు-హరచేయి.
32. పుట్టగోసి-మొలత్రాడు.
33. 1 2 3 గురుపౌర్ణమి.
34. చమత్కార ఆత్మ.
35. క్షమించరాని పాపము.
36. మాయకుడు-అమాయకుడు.
37. మరణము-శరీరము
38. ఎదమీదముద్ర-తల్లి తండ్రి గుర్తు.
39. ద్వితీయుడు-అద్వితీయుడు
40. బయటి సమాజం-లోపలి సమాజం.
41. సేవా శాతము.
42. ప్రపంచ శ్రద్ధ-పరమాత్మ శ్రద్ధ.
43. శ్రీకృష్ణాష్టమి.
44. దేవునిజ్ఞానము-మాయమహత్యము
45. తల్లి తండ్రి.
46. తల్లి తండ్రి-గురువు దైవము.
47. సమాధి.
48. మతము-పథము.
49. కలియుగము
50. దివ్యఖురాన్-హదీసు.

# యోగీశ్వరుల వారి సంచలనాత్మక ప్రసంగాలు

DVD'S

51. పుట్టుట-గిట్టుట.
52. తల్లి.
53. గోరు-గురు.
54. కర్మ మర్మము.
55. ఆత్మ.
56. తాత.
57. గురుపౌర్ణమి.
58. ఇందువు-హిందువు.
59. శ్రీకృష్ణజన్మ మధుర.
60. ఆత్మపని.
61. కర్మ లేని కృష్ణుడు-
    కర్మ ఉన్న కృష్ణుడు.
62. త్రైత సిద్ధాంతము
63. సహజ మరణం-
    తాత్కాలిక మరణం.
64. స్త్రీ-పు / లింగము
65. ఆధ్యాత్మిక ప్రశ్నలు-జవాబులు.
66. దేశం మోసం-దేహం మోహం
67. యోగీశ్వరుల జన్మదిన సందేశము.
68. జీర్ణ+ఆశయము
69. మేఘం ఒకభూతం-
    రోగం ఒకభూతం.
70. దేవునికి మతమున్నదా?
71. ఇచ్ఛాధీన కార్యములు-
    అనిచ్ఛాధీన కార్యములు.
72. ఏది ధర్మము
73. అధర్మ ఆరాధనలు.
74. మూడు పుట్టుకలు-రెండు జాగాలు
75. పుట్టినరోజు ఎవ్వరికీ రాదు.
76. నిదర్శ - నిరూప
77. నటించే ఆత్మ
78. సంచిత కర్మ
79. గురువు ఎవరు?
80. శ్రీకృష్ణుడు ఎవరు?
81. సుఖము-ఆనందము
82. టక్కుటమారా, ఇంద్రజాల
    మహేంద్రజాల, గజకర్ణ గోకర్ణ.
83. భయం
84. దశ-దిశలు.
85. ఆడించే ఆత్మ
86. స్వార్థ రాజకీయం (స్వ+అర్థ రాజకీయం)
87. మూడు నిర్మాణాలు-ఒక పరిశుభ్రత
88. ఏది శాస్త్రము?
89. తెలుగులో మూడు-ఆరు-తొమ్మిది.
90. 6-3=6.
91. గుర్తింపబడనివాడు గురువు.
92. జ్ఞానము దగ్గర జాగ్రత్త!



యూ ట్యూబ్ వీడియోలు
http://www.youtube.com/channel/UCkrD6R8nEU0-O7gNn46Ktfw

# ఇందూ జ్ఞానవేదిక ప్రచురణలు లభించు చిరునామా



## ప్రబోధాశ్రమము (శ్రీకృష్ణమందిరము)

చిన్నపొడమల (గ్రా), తాడిపత్రి (మం), అనంతపురం (జిల్లా) A.P.
Cell : 9866512667, 9951675081, Fax : 08558-225966.

**ఇందూ జ్ఞానవేదిక**

**(రాష్ట్రకార్యాలయము)** Fax : 040-24146006.
శ్రీదేవికాంప్లెక్స్, ప్రభాత్‌నగర్,
చైతన్యపురి, దిల్‌సుఖ్‌నగర్, హైదరాబాద్
9848057951, 9491877239, 9848590172.

*****

**పి. నాగయ్య** (ప్ర.సభ్యుడు)

ఇ.నెం. 76/97/29, కోట్లనగర్ ప్రక్కన,
వీకర్ సెక్షన్ కాలనీ, కర్నూలు (జిల్లా).
Cell : 9440244598, 9849303902,

*****

**బాలం లక్ష్మీనరసింహులు** (ప్రెసిడెంట్)

కదిరి రోడ్డు, రాజానగర్, నీరుగట్టువారి
పల్లి, మదనపల్లి, చిత్తూరు జిల్లా.
Cell : 9440825533, 8519938999.

*****

**పోటు వెంకటేశ్వర్లు (గురూజీ)** (ప్రెసిడెంట్)

ధన్వంతరి హెల్త్ కేర్ సెంటర్,
హుజూర్‌నగర్, నల్లగొండ (జిల్లా)
Cell : 9848574803, 9502932941.

*****

**పి. ఆదినారాయణ** (ప్ర.సభ్యుడు)

భాగ్యనగర్ ముద్దిరెడ్డి పల్లి (గ్రా॥),
హిందూపురం (తా), అనంతపురం (జిల్లా).
Cell : 9440745800, 7259851861.

**కె.లక్ష్మీనారాయణాచారి** (ప్రెసిడెంట్)

బ్యాటరీషాప్, నియర్ ఎస్.ఐ.యు చర్చి,
మార్కెట్‌స్ట్రీట్, ధర్మవరం, అనంతపురం (జి)
Cell :9440556968, 9290012413,
9440601136.

*****

**అనమల మహేశ్వర్** (ప్రెసిడెంట్)

చవటపాల్యం (గ్రా), గూడూరు (మం),
నెల్లూరు జిల్లా. Cell : 9494631664,
9490809181, 8106065300.

*****

**డా॥యం. వెంకటేశ్వర రావు** (ప్రెసిడెంట్)
MD (acu)

డోర్ నెం. 24-4-178, గోవింద నిలయం,
శాంతినగర్, నెల్లూరు జిల్లా - 524003.,
Cell : 9440615064, 9246770277.

*****

**టి. వీరనారాయణ రెడ్డి** (ప్ర.సభ్యుడు)

బట్టేపాడు గ్రా॥ ఆత్మకూరు మం॥,
నెల్లూరు (జిల్లా)., Pin : 523322.
Cell : 9494618322, 8374923363

*****

**బి. ఆదిశేషయ్య** (టీచర్) (ప్రెసిడెంట్)

రామానుజం స్కూల్ దగ్గర, ఉప్పరవీధి,
గుత్తి, అనంతపురం (జిల్లా)
Cell : 9491362448, 7382986963.

**ఎన్.బి. నాయక్** (ప్ర.సభ్యుడు)
పెదమడక, అగనంపూడి,విశాఖపట్నం (జిల్లా)
Cell : 7396492239, 9248315309

*****

**డా॥బి. ధర్మలింగాచారి** (ప్ర.సభ్యుడు)
శ్రీ కనక మహాలక్ష్మి క్లినిక్,
(S కోట), విజయనగరము (జిల్లా).
Cell: 08966-275208, 9704911737

*****

**వి. శంకర రావు** (ప్ర.సభ్యుడు)
అశోక్‌నగర్, కొత్తపేటవాటర్ ట్యాంక్,
విజయనగరము (జిల్లా).
Cell : 9703534224, 9491785963.

*****

**ఎ. నాగేంద్ర** (ప్రెసిడెంట్)
కమ్మపాలెం వీధి, క్రొత్త చెరువు (గ్రా, మం)
అనంతపురం జిల్లా. Cell : 9493622669,
9959316410, 9949995090.

*****

**రౌతు శ్రీనివాసరావు** (ప్రెసిడెంట్)
ఏటుకూడు రోడ్, దర్గామాన్యం, గుంటూరు (జి)
Cell : 9948014366, 9052870853

*****

**డి. బాలాజీ** (వైస్ ప్రెసిడెంట్)
బంగారు పాళ్యం (గ్రా), చిత్తూరు జిల్లా.
Cell : 9985483241, 7396077408.

*****

**వై. రేణుక దేవి** (ఇ.సభ్యులు)
పద్మావతినగర్, తిరుపతి.
Cell : 9491773455, 9032903955.

**వి.సి.వర్మ (గురూజీ) ఆనందాశ్రమము**
మజ్జివలస (గ్రా, పోస్టు), భీమిలి (మం),
విశాఖపట్నం (జిల్లా) - 531162.
Cell : 9441567394, 9502172711.

*****

**ఇందూ జ్ఞానవేదిక శాఖ**
మద్దిగట్ల (గ్రా), పెద్దమందడి (మం),
మహబూబ్‌నగర్ (జిల్లా).
Cell : 8790558815, 9440655409,
9701261165.

*****

**ఎన్.వి. రామకృష్ణ** (ప్ర.సభ్యుడు)
మెయిన్ రోడ్డు, బొద్దాం (గ్రా),
రాజాం (మం), శ్రీకాకుళం (జిల్లా).
Cell : 9494248963, 9959779187.

*****

**టి. ఉదయకుమార్** (ప్రెసిడెంట్)
మోటుపల్లివారి వీధి, బుధవారము
మార్కెట్, భీమవరం-1, పశ్చిమగోదావరి.
Cell : 9948275984, 7386433834.

*****

**టి.వి. రమణ** (ప్రెసిడెంట్)
ముదిగుబ్బ (గ్రా, మం), కదిరి (తా),
అనంతపురం జిల్లా-515511.
Cell : 9440980036, 8185020272.

*****

**వి. రామక్రిష్ణన్** (వైస్ ప్రెసిడెంట్)
నిరంజన్ టైమ్స్, తహశీల్దార్ ఆఫీస్
ఎదురుగా, నేతాజిరోడ్డు కుప్పం,
చిత్తూరు జిల్లా., Cell : 9652755110.
: 9440305700

# యోగీశ్వరుల మాటే ఒక గంటు

కొన్ని సందర్భములలో మీ అమ్మ గంటూ, మీ నాన్న గంటూ అని ప్రశ్నించి అడుగుచుంటాము. ఇక్కడ గంటు అనగా మూట అని అర్థము. విలువైన వస్తువుగానీ, పదార్థముగానీ ఉన్న మూటను ప్రత్యేకముగా గంటు అని అంటాము. గంటు అను పదమునుండి పుట్టినదే ఘంటు అనునది. పదార్థముతోగాక అర్థముతో కూడుకొన్న శబ్ధమును ఘంటు అని అనడము జరిగినది. కంటికి కనిపించు మూటలో పదార్థముండగా, చెవికి వినిపించు ఘంటులో అర్థము మాత్రము ఉంటుంది. పదార్థమున్న మూట అమ్మదయితే అమ్మ గంటు అని అనడమూ, లేక నాన్నదయితే నాన్న గంటు అని చెప్పడము జరిగెడిది. తెలుగు భాష క్షీణదశకు వచ్చిన ప్రస్తుత కాలములో, తెలుగు భాషలోని అనేక పదములు వాడుకలో లేకుండా పోయినవి. అలా వాడకుండా పోయిన వాటిలో గంటు అను పదము కూడ ఒకటి కలదు.

భాషా పదములకు అర్థమునిచ్చు గ్రంథమును నిగంటువు (నిఘంటువు) అని పిలువడము జరుగుచున్నది. అయితే కాలక్రమమున "గ" అను అక్షరము వత్తి పలుకు "ఘ" అను అక్షరముగా మారిపోయివుండుట వలన నిఘంటువు అను పదములో గంటు లేక మూట అను అర్థము లేకుండా పోయినది. ఈ విధముగా తెలుగు భాషలో పూర్వము పెద్దలు నిర్ణయించిన పదములు ఎన్నో మారిపోవుట వలన వాటి అసలు అర్థము తెలియకుండా పోయినది. గంటు ఘంటుగా కొంత మారిపోయినట్లు అనేక పదములు మారిపోయినా, నేడు భాషాపండితులయిన వారు కూడా గుర్తించకపోవడము దురదృష్టమనియే చెప్పవచ్చును. అటువంటి పదములలో ఉదాహరణకు ఒక పదమును గురించి వివరిస్తాను చూడండి. వ్యయము అనగా నాశనము అనిగానీ, ఖర్చు అయిపోవడమనిగానీ, లేకుండా

పోవడమనిగానీ అర్థముగలదు. వ్యయము=నాశనము, ఖర్చు, అయి పోవడము. సాయము అనగా సహాయము అనిగానీ, ప్రక్కనుండి వచ్చు ఆదాయమనిగానీ చెప్పవచ్చును. సాయము=సహాయము. ఆదాయము ఇతరులనుండి లభించిన ధనము లేక ఏదైన లేనిది లభించడము. ఇంత వరకు మనకు బాగా అర్థమయినది. ఇప్పుడామాటనటుంచి ఒక కార్యమును గురించి మాట్లాడుకొందాము. ఒక రైతు తన పొలములో ఒక మూట గోధుమలను చల్లివచ్చాడు. తనవద్దయున్న మూట గోధుమలు లేకుండా పోయాయి. ఉన్న గోధుమలు లేకుండాపోయాయి కావున గోధుమలను ఖర్చయిపోయాయి అనిగానీ, వ్యయమైపోయాయి అనిగానీ, ఉన్నవి లేకుండా పోయాయి అనిగానీ చెప్పవచ్చును. అలా రైతువద్దయున్న మూట గోధుమలు వ్యయమైపోయిన తర్వాత మూడు నెలలకు గోధుమలను ఖర్చుచేసిన లేక పారపోసిన పొలమునుండి పంట రూపములో ముప్పై ఒక్క (31) మూట గోధుమలు పండి రైతుకు రావడము జరిగినది. అప్పుడు పొలములో వ్యయమయినది ఒకమూట అయితే పొలమునుండి లభించిన ఆదాయము లేక సహాయము ముప్పై (30) మూటలుగా లెక్క తేలుచున్నది. ఈ లెక్క ప్రకారము మూడు నెలలక్రింద మూట వ్యయమైతే ఇప్పుడు అదే పొలము నుండి లభించిన సాయము ముప్పైమూటలు అని అందరికీ తెలియుచున్నది కదా!

అయితే ఈ కార్యమునంతటినీ కలిపి చూస్తే మొదట మూట నష్టము తర్వాత ముప్పై మూటలు లాభము. దీనినే మొదట వ్యయము తర్వాత సాయము అని అన్నారు. అదే ఉద్దేశ్యములో వ్యయ+సాయము అని చెప్పుచూ వ్యయసాయము అను పదమును వాడారు. రైతు వ్యయ సాయము చేస్తాడు అంటే ఆ మాటను ఎవరూ తప్పుపట్టుటకు వీలులేదు.

అయితే కాలక్రమమున భావమును చూడని భాషావాదులు పుట్టుక రావడముతో **వ్యయసాయము** అను పదము **వ్యవసాయము** అను పదముగా మారిపోయినది. రైతువద్ద జరిగే పనికీ వ్యవసాయము అను శబ్ధమునకు ఏమాత్రము సంబంధములేకుండా అర్థహీనమై పోవుచున్నది. భావముతో కూడుకొన్న పదమును మాలాంటి వారు చెప్పినా, మా మాటనే తప్పు అనువారు చాలామంది తయారైనారు. అలా మారిపోయిన మాటలు, అర్థము లేని మాటలు, తెలుగు భాషలో కోకొల్లలున్నాయి. ఈ మాట తప్పు, ఇది అర్థములేని మాట, ఇది సత్యము, ఈ మాట అర్థముగల మాట అని చెప్పితే, మీరు మార్చి చెప్పితే మా మనోభావాలు దెబ్బతింటాయి అనువారు గలరు. భావము లేని మాటలను పట్టుకొని మా మనోభావములో అట్లే వుండాలి లేకపోతే మా భావాలు దెబ్బతింటాయి అనువారు కలరు.

భావములు మారిపోయిన పదములలో కొన్నిటిని చూస్తే వ్యయసాయము√, వ్యవసాయము ×, దృష్ఠి తగలడము√, జిష్ఠి తగలడము×, ఆరోగము√ ఆరోగ్యము×. ఫతము√, మతము×, నరసింహా√, నరశింహా×, పురుషోత్తమ√ పురుశోత్తమ×, ఇందూ√, హిందూ×, ధర్మవరుడు√, ధర్మపరుడు×, ఉపాసనావరుడు√, ఉపాసనాపరుడు× మొదలగు పదములు గలవు. ఎలా తప్పో, ఎలా పొరపడుచున్నామో కొంత వివరిస్తాము చూడండి. ఒకడు దైవజ్ఞానము కల్గియుంటే వానిని జ్ఞానపరుడు అని అంటాము. అయితే మన ఉద్దేశ్యమునకూ, పలికే మాటకు ఎంతో తేడాయున్న విషయమును చాలామంది గ్రహించలేకపోవుచున్నారు. జ్ఞానమును వరముగా పొందిన వానిని లేక జ్ఞానము వరించిన వానిని జ్ఞాని అనిగానీ జ్ఞానవరుడు అని అనవచ్చును. అయితే జ్ఞానపరుడు అంటే అతడు జ్ఞానికాదు అజ్ఞాని అని అర్థము కాగలదు. పర అంటే వేరు అని అర్థము.

జ్ఞానమునకు వేరుగాయున్న వానిని జ్ఞానపరుడు అని అనవచ్చును. పరదేశి అన్నప్పుడు ఈ దేశము వాడుకాదు. ఇతర దేశమువాడని ఎలా అర్థము గలదో, అలాగే పరమాత్మ అన్నప్పుడు ఆత్మకాదు, ఆత్మకంటే వేరుగాయున్న వాడని ఎలా అర్థమగుచున్నదో, అలాగే పర అను శబ్ధము వచ్చినప్పుడు వేరయినదని అర్థము చేసుకోవలెను. ఆశాపరుడు అనిగానీ, అత్యాశాపరుడు అనిగానీ చెప్పినప్పుడు వానిని ఆశ లేనివానిగా లెక్కించవలసియుండగా, దానిని వ్యతిరేఖముగా ఆశకల్గినవాడని లెక్కించుచున్నాము. ధర్మమున్న వానిని **ధర్మవరుడు** అనియూ, ధర్మము లేనివానిని **ధర్మపరుడు** అని అనాలి. అయితే దానికి విరుద్ధముగా ధర్మమున్న వానిని ధర్మపరుడు అంటున్నాము. ఈ విధముగా అర్థములేని పదములకు అలావాటైపోయి తెలుగు భాషకు తీరని అన్యాయమును చేయుచున్నామని చాలామంది గ్రహించ లేకపోవు చున్నారు.

ధర్మమున్న వానిని ధర్మపరుడు అంటే, పరదేశి అను పదమునకు ఈ దేశమువాడే (స్వదేశి) అని చెప్పుకోవలసి వస్తుంది. పరదేశి అను వానిని ఈ దేశమువాడేనని చెప్పడము ఎంత తప్పగునో, ధర్మమున్న వానిని ధర్మపరుడు అని చెప్పడము కూడా అంతే తప్పగును. ఈ విధముగా చెప్పుచూ పోతే మారిన పదములతో తెలియని మాటలను ఎన్నిటినో నిత్యము చెప్పుచునేయున్నాము. మా దృష్టిలో ఏదైనా ప్రస్తావనకు వచ్చినప్పుడు అందులో ఏదైనా తప్పుయుంటే ఎప్పటికప్పుడు చెప్పుచునే వస్తున్నాము. ముఖ్యముగా ఆధ్యాత్మిక రచనలలో అన్నిచోట్ల హిందూ అని కనిపించగా, అది అర్థములేని పదమనీ, అర్థముతో కూడుకొన్న వాస్తవమైన **"ఇందూ"** అని చెప్పుచూ వచ్చాము. మా రచనలలో కూడా అర్థములేని హిందూ పదము వ్రాయకుండా అర్థముతో కూడుకొన్న "ఇందూ" అను

పదమునే వ్రాయుచూ వచ్చాము. అయితే హిందూమతములో తమ పెత్తనమే చలామణి కావాలనుకొన్నవారు, మా మాటను వ్యతిరేఖించి వాస్తవమును గ్రహించలేక ఇందూ అనేది పరమతమనీ, నన్ను క్రైస్తవ బోధకుడనీ అసత్య ప్రచారము చేయడము జరిగినది.

ఇందూ అను పదముండవలసిన చోట హిందూ అని ఉండడము వలన, పదమునకు అర్థము లేకుండా పోయి ఇందూ ధర్మములకే ముప్పు ఏర్పడుతుందని మేము ఎంత చెప్పినా, మమ్ములను పరమతము వారి క్రిందికి జమకట్టడము చాలా అన్యాయమని చెప్పవచ్చును. ఇటువంటి ఎన్నో లోపముల వలన ఇందుత్వము యొక్క ధర్మములు ప్రజలకు తెలియకుండా పోయి, ప్రజలు ఇతర మతములలోనికి చేరిపోవుచున్నారు. ఈ విధముగా ఇందుత్వములోని కొందరు స్వార్థపరులు హిందువులు పరమతములోనికి పోవుటకు కారణమైనారు. హిందుత్వమును (ఇందుత్వమును) క్షీణదశకు తెచ్చినవారే వారి తప్పును కప్పిపుచ్చుకొనుచూ, అసలైన ఇందుత్వ జ్ఞానమును ప్రచారము చేయుచున్న మమ్ములను పరమతమువారని ప్రచారము చేయు చున్నారు. మా జ్ఞాన ప్రచారమునకు పరమతమని పేరుపెట్టి ఎన్నో ఆటంకములను కలుగజేసారు. అటువంటి పరిస్థితిలో మేము నోరు విప్పి తప్పు ఒప్పులను చెప్పవలసి వచ్చినది.

ముస్లీమ్‌ల జ్ఞానమునకు ప్రామాణిక గ్రంథము ఖుర్‌ఆన్ అని ముస్లీమ్‌లకందరికీ తెలుసు. అదే విధముగా క్రైస్తవుల ప్రామాణిక గ్రంథము బైబిలు అని క్రైస్తవులందరికీ తెలుసు. అయితే ఇందువుల ప్రామాణిక గ్రంథము ఖచ్చితముగా ఫలానా గ్రంథమని ఇందువులకు తెలియకుండా పోయినది. పల్లెటూర్లలోనికి పోయి "మీరు ఎవరు" అని అడిగితే కులము

పేరు చెప్పగలరుగానీ, మాది ఫలానా మతమని కూడా చెప్పలేక పోతున్నారు. వారికి అర్థమయ్యేలాగున "ముస్లీమ్‌లు ఉన్నారు కదా! వారిని ముస్లీమ్‌లు అని అంటాము. వారిలాగ మిమ్ములను ఏమని పిలువాలి" అని అడిగితే "వాళ్ళు తురకవాళ్ళు మేము తెలుగువాళ్ళమని" భాష పేరు చెప్పుచున్నారు. కొన్ని ఊర్లలో చాలామంది హిందువులు మేము హిందువులమని కూడా చెప్పలేని స్థితిలో, వారిది ఏ మతమో వారికే తెలియని స్థితిలో ఉన్నారు. హిందూ మతములో పెద్దలమనువారు ఆ విధముగా హిందువులను తయారు చేశారు.

పల్లెలలో వారిపని వారు చేసుకోవడము తప్ప తమ మతమేమిటో తమకే తెలియని వారుండగా, కొన్నిచోట్ల కొంత చైతన్యము కల్గి మేము హిందువులము అని చెప్పు స్థోమతలోయున్నారు. అయితే అటువంటి వారిని గురించి "మీకు ప్రామాణిక గ్రంథమేది?" అని అడిగితే కొందరు వేదములని అంటున్నారు. కొందరు రామాయణమనీ, కొందరు భారతమనీ, కొందరు ఉపనిషత్తులనీ, మరికొందరు రామకృష్ణ పరమహంస వ్రాసిన గ్రంథమనీ అనేక రకములుగా చెప్పుచున్నారు. హిందువులను అందరినీ గమనించితే హిందువుల ప్రామాణిక గ్రంథము భగవద్గీతయని నూటికి పదిమంది కూడా చెప్పలేరు. ఇంకనూ గమనించితే హిందువుల జనాభాలో భగవద్గీతను పూర్తి చదివినవారు కేవలము రెండుమంది కూడా లేరు. హిందువుల గ్రంథము భగవద్గీతయని చెప్పినవారిలో ఎనిమిదిమంది వద్ద భగవద్గీతలేదు. వారిలో ఐదుమందివద్ద మాత్రము భగవద్గీత ఉంటే వారు దానిని చదువలేదు. ఎందుకు చదువలేదు అని అడిగితే వారు చెప్పిన సమాధానము "భగవద్గీత చదవకూడదంట కదా! చదివితే కష్టాలు, పోట్లాటలు వస్తాయని మా అయ్యగారు చెప్పారు. దేవుని మూలపెట్టి

పూజ చేయమన్నారు. అందువలన మేము నిత్యము దీపముపెట్టి పూజ చేయుచున్నాము." అని అన్నారు. హిందూమతములో మేము పెద్దలమను కొనువారే హిందువులు భగవద్గీతను చదవకుండా చేశారు. కొందరికయితే "భగవద్గీతను ఇంటిలోనే పెట్టుకోకూడదు. అది గుడిలోనే ఉండాలి. ఇంటిలో ఉంటే దానిని మీరు భరించలేరు." అని భయము చెప్పినవారు కూడా కలరు. ఈ విధముగా మిగతా మతములలోని వారు వారి మత గ్రంథములను తెలిసినట్లు హిందువులు తమ గ్రంథము భగవద్గీతయేనని చెప్పలేక పోవుచున్నారు. హిందూ మతములో పెద్దలుగా చలామణియగు కొందరు తమ స్వార్థ బుద్ధితో హిందువులకు జ్ఞానమే తెలియకుండా చేశారు.

తమ క్రిందయున్న వారికి గీతలోని జ్ఞానము తెలిస్తే, వారు కూడా జ్ఞానులయి మమ్ములను ప్రశ్నించు స్థోమతకు వస్తారనీ, అట్లు కాకుండా తమను ప్రశ్నించకుండా తాము ఏమి చెప్పితే అది వినేటట్లు ఉండాలంటే మిగతా హిందువులకందరికీ జ్ఞానము తెలియకూడదని, కుట్రపన్ని అలా చేయడము వలన నేడు హిందువులలో హిందూ జ్ఞానమే లేకుండా పోయినది. హిందూ ధర్మములేవో హిందువులకే తెలియకుండా పోయినవి. హిందూ మతములోని స్వార్థవరులు తమకు అనుకూలమైన వేదములను హిందువులలో చొప్పించి, భగవంతుడు చెప్పిన భగవద్గీతకు దూరము చేశారు. కొన్ని చోట్ల భగవద్గీతకంటే వేదములే గొప్పవని ప్రచారము చేశారు. అందువలన నేడు హిందువులలో కొందరు తమ ప్రమాణ గ్రంథములు వేదములనీ చెప్పుచున్నారు. త్రేతాయుగమునుండి మాటల రూపములో, పాటల రూపములోయున్న వేదములను ద్వాపర యుగములో వ్యాస మహర్షి నాలుగు వేదములుగా వ్రాసి, వాటికి అనుగుణముగా పదునెనిమిది పురాణములను కూడా వ్రాశాడు. వేదములు, పురాణములు

వ్యాసుని చేత వ్రాయబడి ప్రజలలోనికి పోయిన తర్వాత ధర్మములకు ముప్పుకల్గినదని భగవంతునిగా వచ్చిన శ్రీకృష్ణుడు ధర్మసంస్థాపన కొరకు భగవద్గీతను బోధించాడు. భగవద్గీత అర్జునునికి బోధింపబడిన తర్వాత అర్జునుని ద్వారా భగవద్గీతను వ్యాసుడు తెలుసుకొని తాను వ్రాసినది ధర్మములు కాదనీ, అధర్మములని తెలిసి బాధపడి తాను చేసిన పొరపాటుకు ప్రాయశ్చిత్తముగా భగవద్గీతను రచించి పోయాడు.

వ్యాసుడు ఎంతో కష్టపడి భగవద్గీతను వ్రాయగా వ్యాసుడు చనిపోయిన వెంటనే కొందరు తమకు అనుకూలమైన కొన్ని శ్లోకములను కల్పితము చేసి, భగవద్గీతలోనికి చొప్పించడము జరిగినది. ఆ శ్లోకములు నేటికినీ భగవద్గీతలో అలాగే కనిపిస్తూనే ఉన్నవి. దేవుడు చెప్పిన ధర్మములకు వ్యతిరేఖముగాయున్న కొన్ని శ్లోకములను దైవ జ్ఞానమున్న విచక్షణావరులు ఎవరైనా వాటిని గుర్తించవచ్చును. అయితే అంతవరకు ఎవరినీ పోకుండా భగవద్గీతకు దూరముగా అందరినీ ఉంచడము జరిగినది. భగవద్గీతను చదివితే కష్టము నష్టము వస్తుందని బెదిరించి దానిని చదువకుండా చేశారు. చరిత్రలో ఈ విధముగా ఇందూ సమాజములో ఎంతో తీరని మోసము జరిగినది. మధ్య ఆసియా ఖండమునుండి ఆర్యులు వచ్చి భారత దేశములోని ద్రావిడులను అప్పటినుండే మోసము చేయను మొదలు పెట్టారు. కృతయుగము చివరిలోనుండి, త్రేతాయుగ ప్రారంభమునుండి ఆర్యుల మోసములు ప్రారంభమైనవి. త్రేతాయుగములోనే బ్రహ్మజ్ఞానిగా, త్రికాల జ్ఞానిగా పేరుగాంచిన వ్యక్తిని, బ్రహ్మ అను బిరుదును పొందిన రావణ బ్రహ్మను జ్ఞానియే కానట్లు దుర్మార్గునిగా పోల్చి చూపడము జరిగినది. రామాయణగాథను అడ్డము పెట్టుకొని రావణబ్రహ్మను సులభముగా అజ్ఞానిగా, దుర్మార్గునిగా చిత్రించారు. ఆ విధముగా రావణబ్రహ్మ యొక్క

అడ్డు తొలగించుకొన్నవారు ఆ కాలములోనే మహాబలశాలి అయిన ఆంజనేయున్ని కోతిగా, మహాబుద్ధిశాలి అయిన జాంబవంతున్ని ఎలుగు బంటిగా చిత్రించి జంతువులుగా చూపించారు. ఆ దినము దక్షిణ దేశమున ద్రావిడులుగాయున్న కారణమున రావణబ్రహ్మను రాక్షసిగా, ఆంజనేయున్ని జాంబవంతున్ని జంతువులుగా ప్రచారము చేసి వారికున్న విలువలను మంట గలిపివేశారు. త్రేతాయుగములోనే బ్రాహ్మణుడయిన రావణబ్రహ్మను, గిరిజన కొండ రాజులయిన వాలి, సుగ్రీవులనూ, ఆంజనేయ, జాంబవంతు లను రాక్షసులుగా, జంతువులుగా చెప్పి అసలయిన చరిత్రను తెలియకుండా చేశారు.

గత చరిత్రలో మూడు యుగముల పర్యంతము కొనసాగుతున్న అన్యాయము నేటికిని యథావిధిగా సాగుచునేయున్నా ఇందూ సమాజములో ఎవరూ గుర్తించలేక పోయారు. నేటికినీ ఎవరూ గుర్తించనట్లు తమ అన్యాయములను కొనసాగిస్తూ ఇందూ సమాజమునకు తీరని అన్యాయమును చేయుచునేయున్నారు. ఇప్పటికే దైవజ్ఞానములో ఎంతో నష్టపోయి, ఇందూ జ్ఞానము, ఇందూ ధర్మములు తెలియకుండా పోయి ఇందూ సమాజమను మాట చివరకు హిందూమతముగా మారిపోయి, హిందూమతము కూడా లేకుండా వేరు మతములలోనికి కలిసి పోవు చుండుట మాకు మిక్కిలి బాధగా అనిపించినది. మనుషులు దైవ జ్ఞానమును వీడి మతాలపేరుతో చీలిపోవడమూ, మారిపోవడము మాకు సరిపోలేదు. అనాదిగా జరుగుచున్న అన్యాయమును అరికట్టుటకు, మనుషులను జ్ఞానులుగా మార్చి దైవమార్గములో ఉండునట్లు చేయుటకు మేము ప్రయత్నము చేయాలనుకొన్నాము. ఆ నా ప్రయత్నములో ఇంత వరకు హిందూ సమాజములోనున్న శంకరాచార్యులు అద్వైత సిద్ధాంతమునూ,

రామానుజాచార్యులు విశిష్టాద్వైత సిద్ధాంతమునూ, మధ్వాచార్యుల యొక్క ద్వైత సిద్ధాంతమును అతిక్రమించి, భగవద్గీతలో పురుషోత్తమ ప్రాప్తి యోగమునగల క్షర, అక్షర, పురుషోత్తమ అను ముగ్గురు పురుషుల త్రైత సిద్ధాంతమును ప్రతిపాదించి, ప్రతి మనిషికీ దైవజ్ఞానము అర్థమయ్యేలాగున బోధించడము జరుగుచున్నది.

ఇంతవరకు హిందువులలో ఎవరికీ జ్ఞానము తెలియకూడదను అభిప్రాయముతోయున్న ఆర్య సంతతికి చెందిన కొందరు అగ్రకులముల వారికి మా ఉద్దేశ్యముగానీ, మా జ్ఞానబోధగానీ ఏమాత్రము నచ్చలేదు. హిందూ ప్రజలలో జ్ఞానము తెలిస్తే ఇంతవరకు తాము చేసిన అన్యాయములు బయటపడుననీ, ఇంతవరకు తమ ఆధీనములోయున్నవారు తమ ఆధీనమునుండి లేకుండా పోవుదురనీ, దానితో హిందువులలో తమ ఆధిపత్యము లేకుండా పోవునని తలచినవారై, సులభముగా మా అడ్డు తొలగించుకొనుటకు మమ్ములను పరాయి మతమువారనీ, మేము వ్రాసిన త్రైత సిద్ధాంత భగవద్గీత క్రైస్తవమునకు సంబంధించినదనీ, భగవద్గీతయను పేరుపెట్టి బైబిలును ప్రచారము చేయుచున్నారని అక్రమమైన అన్యాయమైన ఆరోపణలు మా మీద చేయడము జరిగినది. అలవాటు ప్రకారము కొందరు వారి మాటలను నమ్మినా కొందరు ఎవరిది సత్యము, ఎవరిది అసత్యము అని తెలుసుకోగలిగారు. వారి మాటలువిన్న కొందరు మాకు అక్కడక్కడ ఆటంకమును కల్గించినా సత్యమును తెలుసుకొని మేము బోధించు బోధ చాలా గొప్పదని గ్రహించినవారు చాలామందియుండుట వలన మా బోధలు ప్రజలలోనికి సులభముగా చోచ్చుకొని పోయాయి. మా బోధలలో మత ప్రసక్తి లేకుండా, ఉన్నదంతా దైవజ్ఞానమే అయినందున దైవజ్ఞానమును కోరుకొను అన్ని మతముల వారికీ మా జ్ఞానము సులభముగా అర్థమయినది.

దానితో సమాజములోని హిందూమతము వారే కాకుండా, బైబిలును ఆశ్రయించిన క్రైస్తవులూ, ఖురాన్ గ్రంథమును ఆశ్రయించిన ముస్లీమ్‌లు త్రైతసిద్ధాంత జ్ఞానమువైపు ఆకర్షితులై, సంపూర్ణ జ్ఞానులుగా మారను మొదలు పెట్టారు.

ఈ విధముగా మూడు మతముల వారికీ సులభముగా త్రైత సిద్ధాంత బోధ అర్థమగుట వలన ఎవరి మతములో వారుంటూ మా జ్ఞానమును తెలుసుకోవడము జరిగినది. ఆ విధముగా వచ్చిన వారిలో యోహాన్ అను ఒక క్రైస్తవ భక్తుడు కూడా కలడు. ఆయన నావద్దకు వచ్చి తాను మా గ్రంథములలో తెలుసుకొన్న పదములకు ఉన్న జ్ఞాన అర్థములను వ్రాసి ఇస్తానని చెప్పాడు. దానికి మేము అంగీకరించగా మా గ్రంథములలో గల పదములకు ఉన్న జ్ఞాన అర్థములను వ్రాసి ఇవ్వడము జరిగినది. అలా వ్రాసిన గ్రంథమునకు **"త్రైత సిద్ధాంత ఆధ్యాత్మిక గంటు"** అని పేరు పెట్టడము జరిగినది. త్రైత సిద్ధాంత ఆధ్యాత్మిక గంటును చూచిన తర్వాత దీనిని ఒక క్రైస్తవుడు వ్రాశాడు అంటే ఎవరూ నమ్మలేరు. హిందూ మతము వారిని క్రైస్తవులుగా మార్చుటయే ముఖ్యమైన పనిగా పెట్టుకొన్న కుటుంబము నుండి వచ్చిన వ్యక్తి వ్రాసినదంటే ఎవరూ నమ్మరు. పూర్తి క్రైస్తవ భక్తుడుగా యున్న యోహాన్ ఆధ్యాత్మిక గంటును వ్రాసి ఇవ్వడమే కాకుండా ఆయన ఉద్దేశ్యమును, ఆయన విన్నపమును వ్రాసి ఇవ్వడము జరిగినది. ఆయన అభిప్రాయమును చదివిన తర్వాత క్రైస్తవ సమాజములో కూడా ఇటువంటి వారుంటారా! అని నాకే కొంత ఆశ్చర్యము అయినది. ఒక క్రైస్తవుడు తన సమాజమునకు, తన మతమునకు కట్టుబడియుండక మతదృష్ఠి వదలి దేవుడు అను దృష్ఠితో దేవుని జ్ఞానమును కోరుకొన్నందుకు మాకు చాలా సంతోషము. నేటి సమాజములో యోహానులాంటి ఎందరో క్రైస్తవులు,

ముస్లీమ్‌లు మా జ్ఞానమువైపు వస్తుండగా నేటికినీ కొందరు హిందువులు మా జ్ఞానము తెలుసుకోలేక వ్యతిరేఖముగా మాట్లాడడము కొంత బాధ అనిపించినా, హిందువులలో ఇంతకాలము జ్ఞానము తెలియక నలిగిపోయిన వారు నేడు వాస్తవ ఇందూ జ్ఞానమును తెలియగలిగి పూర్తి జ్ఞానులుగా మారిపోవుచుండుట సంతోషింపదగిన విషయము. మా ముందర మూడు మతముల వారు ఒక త్రాటిమీదికి వచ్చి జ్ఞానులుగా మారిపోవడము చూస్తే, పోతులూరి వీరబ్రహ్మముగారు **"మూడు మతములు ఒక్కటవును"** అని చెప్పిన కాలజ్ఞాన వాక్యము అప్పుడప్పుడు జ్ఞప్తికి వస్తుంటుంది. అంతేకాక **"మూడు మతములను ఒక్కటి చేయువాడు వస్తాడు"** అను బ్రహ్మముగారి మాట నెరవేరినట్లు తెలియుచున్నది.

ఇప్పుడు యోహాన్ వ్రాసిన అతని అభిప్రాయమును, అతని విన్నపమును చదవండి. తర్వాత ఆయన వ్రాసిన త్రైత సిద్ధాంత ఆధ్యాత్మిక గంటును చూడండి. అంతేకాక చివరిలో మేము వ్రాసిన రెండు చిన్న వ్యాసములను చూడండి. ఆ రెండు వ్యాసములను చదివితే హిందూ సమాజము చరిత్రలో ఎట్లు మోసపోయినది, ఇప్పుడు ఎట్లు మోసపోవు చున్నది తెలియగలదు. దానిని తెలియగల్గితే భవిష్యత్తులో హిందూ సమాజము మోసపోకుండా జాగ్రత్తపడగలదు.

ఇట్లు

**అర్ధ శతాధిక గ్రంథకర్త, ఇందూ (హిందూ) ధర్మప్రదాత,**

**సంచలనాత్మక రచయిత, త్రైత సిద్ధాంత ఆదికర్త**

# శ్రీశ్రీశ్రీ ఆచార్య ప్రబోధానంద యోగీశ్వరులు



# యోహాన్ అభిప్రాయము

***అర్ధశతాధిక గ్రంథకర్త, ఇందూ ధర్మప్రదాత, సంచలనాత్మక రచయిత, త్రైత సిద్ధాంత ఆదికర్త, శ్రీశ్రీశ్రీ ఆచార్య ప్రబోధానంద యోగీశ్వరుల వారి పాదపద్మములకు నమస్కరిస్తూ, మూడు ఆత్మల జ్ఞానమును తెలుసు కొంటున్న త్రైతులకు, జ్ఞానపుత్రులకు, సత్యాన్వేషులకు నా అనుభవములను తెలియజేయునదేమనగా....***

నా చిన్నతనములో మా అమ్మ (మాణిక్యమ్మ) క్రైస్తవ మతములో బాగా లీనమై దైవసేవకురాలిగా ఉండేది. మా ఊరు గుంటూరు జిల్లా పొన్నూరు తాలూకా, భల్లుఖానుడుపాలెం (బి.కె.పాలెం) లో మా అమ్మ కమ్మ కులస్తులను ప్రభావితం చేసింది. చదువులేదు. అయినా కూడా తను తెలుసుకున్న జ్ఞానముతో చాలామందినే జమ చేసింది. వారు ఇప్పటికీ ఉన్నారు. "ది లెమెన్స్ ఇవాంజలికల్ ఫెలోషిప్" అనే ఒక క్రిష్టియానిటి సంస్థను చెన్నైలో స్థాపించిన జాషువా డానియేల్‌గారు దానికి అధిపతి. అప్పట్లో (1977) ప్రజలలో చాలా చైతన్యవంతంగా పని చేసింది ఆ సంస్థ. అందులోనే మా అమ్మ దైవసేవకురాలిగా పనిచేసి జనాన్ని ప్రభావితం చేసింది. అప్పట్లో సంవత్సరానికి ఒకసారి "క్రైస్తవ ఉజ్జీవ సభలు" అని మీటింగులు కూడా మాఊర్లో పెట్టించేది. చాలా నియమాలు నిష్టలు పాటించేది. నన్ను సినిమాలకు కూడా పోనిచ్చేది కాదు. నా 15వ యేట నేను చూసిన మొట్టమొదటి సినిమా "కరుణామయుడు" స్వయంగా మా అమ్మే తీసుకువెళ్ళి చూపించింది. నా చిన్నతనమునుండి నాకు దైవ జిజ్ఞాస ఎక్కువగానే ఉండేది. మా ఊర్లోగానీ, చుట్టుప్రక్కల ఊళ్ళలోగానీ, మీటింగు (ప్రార్థన) 'కూటమి' జరుగుచున్నదంటే, మా అమ్మ ఆజ్ఞమేరకు నేనే పరుగెత్తు కొంటూ ఇంటింటికి పోయి ఫలానాచోట "కూటమి" జరుగుచున్నది కావున మీరందరూ రావలెనని ప్రచారము చేసి వచ్చేవాడిని. మానాన్న పొలం

కౌలుకి చేస్తూ తటస్థంగా ఉండేవాడు. 1980లో మా అమ్మ గుంటూరు ఆసుపత్రిలో కేన్సర్ జబ్బుతో చనిపోయింది. చాలామంది ప్రార్థనలు చేశారు. అప్పుడు నేను 7వ తరగతి చదువుతున్నాను.

తరువాత సాల్వేషన్ ఆర్మీ "రక్షణ సైన్యము" అనే ఫారిన్ నిధులతో నడుపుచున్న క్రైస్తవ సంస్థ బాపట్ల దగ్గరలోని 'స్టూవర్ట్‌పురం'లో ఉంది. అందులో ఇంటర్‌మీడియట్ మొదటి సంవత్సరము వరకు చదివి ఆపి వేయడం జరిగి, హైదరాబాద్ రావడం జరిగింది. వృత్తిరీత్యా ఆర్టిస్ట్ అయినందుకు చాలా ఆనందపడేవాణ్ణి. దేశభక్తి, దైవభక్తి రెండూ ఉండేవి. రెండింటిలో దైవభక్తే ఎక్కువగా ఉండేది. ఇంతకుముందు చదివిన బైబిలు రెండు భాగములుగ ఉండేది. అందులో పాతనిబంధనలో ఏసుక్రీస్తునకు ముందు చరిత్ర ఉండేది. క్రొత్త నిబంధనలో ఏసుక్రీస్తు వారి జన్మ, సువార్తలు ఉండేవి. పాతనిబంధన అర్థమయ్యేది కాదు. క్రొత్త నిబంధన కొంత అర్థమయ్యేది. ఒకరకంగా కలగలుపుగా ఉండేది. జ్ఞాన సంబంధమైన కొన్ని ప్రశ్నలకు నాకు సమాధానాలు దొరికేవికావు. పుస్తకములు చదవడం నాకు మొదటినుండి కొట్టిన పిండే. పాస్టర్లు సెనగపప్పు బెల్లం తిన్నంత ఈజీగా పరలోకప్రాప్తి లభిస్తుందని బోధించేవారు.

హైదరాబాద్‌లో ఆర్టిస్టుగా పనిచేస్తున్నప్పుడు శ్లోకములు రాయడానికి శ్రీకృష్ణానందమఠం (దిల్‌సుఖ్‌నగర్) వెళ్ళడం జరిగింది. నేనూ అప్పుడు దిల్‌సుఖ్‌నగర్ పి&టి కాలనీలో ఉంటున్నాను. మఠం స్వామివారికి నావర్క్ నచ్చింది. ఆ మఠంలోపల ఒక హాల్‌లో (పూజ, సత్సంగం జరిగేహాలులో) చుట్టూ శ్లోకములు తామస, రాజస, సాత్త్వికములు మొదలగు దయాగ్రాంలను వ్రాయడానికి దాదాపు నెలరోజులు పట్టింది. మధ్యమధ్యలో బయట వర్క్‌లు కూడా చేశాను. ఈలోపు మఠంలో ఉన్న ఉపనిషత్తులు, మఠం స్వామివారు

వ్రాసిన కొన్ని పుస్తకములు చదవడం జరిగింది. నాకున్న కొన్ని ధర్మ సందేహాలకు సమాధానాలు ఉపనిషత్తులలో కొన్ని లభించాయి. చాలా ఆనందం కలిగింది. దేవతలకు దేవునికి తేడా తెలిసింది. మఠంలో శ్రీకృష్ణులవారి భక్తిపూజలు ఉన్నా, ఇతర దేవతలను కూడా కలుపుకొని పుస్తకములలో రచించేవారు. మఠంలో స్వామివారు క్రిష్టియానిటీని పర మతంగానే భావించేవారు. ఒక రకంగా అంతా ఒకటే అనేవారు. ఘంటసాల వెంకటేశ్వర్రావు గారు పాడిన 108 శ్లోకములను శ్రద్ధగా వినేవాణ్ణి, వింటున్నప్పుడు హృదయం ద్రవించి ఆనంద బాష్పాలు వచ్చేవి. ఇప్పటికీ అలాగే వస్తాయి.

గడచిన 15 సంవత్సరముల కాలంలో మహారాష్ట్ర, కర్ణాటక, గోవా, తమిళనాడు, ఆంధ్రప్రదేశ్‌తో సహా వివిధ కంపెనీల ఎడ్వర్‌టైజ్‌మెంట్స్ గోడలపై వ్రాయడం నిమిత్తం క్యాంపులు తిరుగుతూ, దొరికిన దైవ సంబంధ పుస్తకాలను చదువుతూ, జ్ఞానాన్వేషణ చేస్తూ, ఇంకా క్రొత్త విషయాలను తెలుసుకోవాలనే జిజ్ఞాసతో వెతుకుతుండేవాడిని. ఇంతమంది దేవతలు అవసరమా? అనిపించేది. ఇంకొక బాణీలో అసలు ఈ పేదరికానికి మూలమెక్కడ? అని వెతికేవాణ్ణి. ఈ పరంపరలో ఇన్ని ఊళ్ళు తిరగడం వర్క్ చేయడంలో చిరాకుపడేవాణ్ణికాదు. అలా రాసిపెట్టి ఉంది అని తలంచేవాణ్ణి. కష్టమైనా, నష్టమైనా ఆనందంగానే ఉండేది.

సుమారు 10 సం॥ క్రితం పి&టి కాలనీనుండి శ్రీకృష్ణానంద మఠంలో భక్తునిగా ఉన్న విజయభాస్కరరెడ్డిగారు మోహన్‌నగర్‌లోని వాళ్ళ ఇంటిలో మూడవ అంతస్తులో ఒక రూం కేటాయించి నన్ను అక్కడ ఉండమన్నారు. అప్పుడు ఆయన ఏపి కో ఆపరేటివ్ బ్యాంకు దిల్‌సుఖ్ నగర్‌లో బ్రాంచ్ మేనేజర్‌గా ఉన్నారు. వాళ్ళ ఇంటికి "శ్రీకృష్ణ నిలయం"

అని నా చేతే స్కెచ్ గీయించి సిమెంట్ అక్షరాలు చెక్కించారు. నేను రావలసిన చోటికే వచ్చాననిపించింది. ఆ టైంలోనే శ్రీకృష్ణుల వారిపై విపరీతమైన భక్తితో ఉన్నాను. శ్రీకృష్ణులవారినెలాగైనా చూడాలనే ధ్యాసతో ఘంటసాలగారు పాడిన భగవద్గీతలోని ఒక శ్లోకం :-

**కర్మసన్యాసయోగము**

*శ్లో॥ 27. స్పర్శాన్ కృతత్వా బహిర్బాహ్యాం శ్చక్షుశ్చైవాంతరే భ్రువోః॥*
*ప్రాణాపానౌ సమౌ కృత్వా నాసాభ్యంత రచారిణౌ॥*

"ఎవడు దృష్ఠిని భ్రూమధ్యమున నిల్పి, ప్రాణాపాన వాయువులను స్థంభింపజేసి, మనస్సుని, బుద్ధిని స్వాధీనమొనర్చుకొని మోక్షాసక్తుడై ఉండునో వాడే ముక్తుడనబడును." ఈ శ్లోకమును పట్టుకొని, ప్రతిరోజూ రాత్రి 10గం॥ నుండి 12 గంటల వరకూ కళ్ళు మూసుకొని మామూలు చాపపై, నిటారుగా తూర్పుదిశగా కూర్చొని ఏ ధ్యానం లేకుండానే భ్రూ మధ్యమున దృష్ఠినిల్పి అదే సంకల్పంతో వెదకను మొదలుపెట్టాను. పగలు వర్క్ చేసి, రాత్రి 10 గం॥ నుండి ఇదే పనిలో ఉండగా, మూడు రోజుల తరువాత కావచ్చు గుర్తులేదు, భ్రూమధ్యమున దారి ఏర్పడినది. సన్నగా మొదలైంది. వెలుగులాంటి దారి. ఆ దారిలో ముందుకు పోతున్న అనుభూతి. మొత్తానికి దారి క్లియరైందనే ఆనందం అలా ఏడు రోజులు గడిచింది. విజయభాస్కర్‌రెడ్డిగారు ప్రొద్దున్నే లేపేవారు. ఖాళీగా ఉన్న రోజులలో ఇంట్లో కూర్చొని గ్రంథాలు చదవమనేవారు. అయితే విజయ భాస్కరరెడ్డిగారు ఆ టైంలో "చిక్కిపోతున్నావేంటి? భోజనం చేయటం లేదా?" అనికూడా అడిగారు. అదేంలేదు తింటున్నానని చెప్పా. నేను యోగంలో కూర్చున్నా, అది యోగమనే సంగతి నాకు తెలియదు. ఆ విషయం సార్‌కి నేను చెప్పలేదు. జ్ఞానసేత్రం తెరవడం అలవాటైంది. "జ్ఞానసేత్రం"

అన్న సంగతి అప్పుడు తెలియలేదు. పదవరోజున మామూలుగానే దృఢమైన సంకల్పంతో కూర్చొని భ్రూమధ్యమున కన్ను తెరిచి ముందుకి పోతుండగా ఎంతసేపు గడచిందో తెలియదు. ఇహలోకమైన జ్ఞప్తిలేదు. అదే ధ్యాస. కొంతసేపటికి ఒక గొప్ప వెలుగు ఎదురు వచ్చినట్లయింది. ఆ తెల్లటి వెలుగు చూడలేనటువంటిది, వర్ణించతరము కానటువంటిది. భయము వేసింది. వెనక్కు పోవాలనే సంకల్పం కలిగింది.

తరువాత ఇహలోకములోనికి రావడానికి 5 నిమిషములపాటు తన్నుకు రావడం జరిగినది. ఇహలోకములోనికి వచ్చినట్లు జ్ఞప్తికొచ్చింది. కళ్ళు తెరచి చూసా, చాప, దుప్పటి, దిండు చెల్లాచెదురై ఉన్నవి. ఒళ్ళంతా చెమట్లు పట్టాయి. బయట విపరీతమైన చలి. అది చలికాలం. లేచి అన్నీ సర్దిపెట్టి, దీర్ఘంగా కూర్చొని జరిగిన సంఘటనను గుర్తు చేసుకున్నా. అప్పుడు దాదాపు అర్థరాత్రి 2గం॥లు కావచ్చు. ఆ సంఘటన తాలూకు వెలుగు గుర్తొచ్చిన వెంటనే గొప్ప ఆనందం పెల్లుబికింది. అనిర్వచనీయమైన ఆనందం. లేచి గంతులు వేశాను. సచ్చిదానందము (సత్+చిత్) ఆనందము అంటే ఇదే అని అర్థమయింది. ప్రాపంచిక ఆనందము కంటే అతీతమైనదని తెలిసింది. బయటికి రాకుండా అలాగే ఉంటే శ్రీకృష్ణులవారు ప్రత్యక్షమయ్యేవారు అనిపించింది. అభ్యాసము తోటి ఇంకా ముందుకు పోవచ్చుననిపించింది. ఇక ఇంతవరకు చాలు కొన్ని రోజుల తరువాత చేయవచ్చునని, ఆ రోజుతో యోగం ఆపివేయడం జరిగినది. తరువాత కొన్ని రోజులకు మఠం స్వామి వారి దగ్గర మాటల సందర్భములో నేను చేసిన యోగం గురించి చెప్పడం జరిగింది. అప్పుడు విజయభాస్కర్ రెడ్డిగారు అక్కడే ఉన్నారు. మఠం స్వామిగారు మంచిదే కదా అన్నారు. ఏమీ మాట్లాడలేదు. ఇప్పటికి దాదాపు ఏడు సంవత్సరముల క్రితం, నా

చిరకాల మిత్రుడు జి.యన్.మూర్తిగారు (ఇప్పుడు జ్ఞానమార్గములోనే ఉన్నారు) వాళ్ళ ఊరు నుండి వచ్చిన (తాడేపల్లిగూడెం) వి.హెచ్.పి (విశ్వ హిందూ పరిషత్) కార్యకర్తకు నన్ను పరిచయం చేశారు. వి.హెచ్.పి కార్యకర్తగా చేరమన్నట్లు సమాచారం. అతను హైదరాబాద్ వచ్చింది కూడా అందరికీ పరిచయమైన జి.పుల్లారెడ్డి మనుమరాలి పెళ్ళి నిమిత్తమని తెలిసింది. జి.పుల్లారెడ్డిగారు వి.హెచ్.పిలో సభ్యులుగ అర్థమైనది. ఆ పెళ్ళికి నన్ను ఆహ్వానించారు. కోఠీలోని వి.హెచ్.పి ప్రధాన కార్యాలయము దగ్గర కలవడం జరిగినది. ఆ పెళ్ళికి నేను హాజరు కాలేదు. తరువాత కొన్ని రోజులకు జి.యన్ మూర్తిగారి ద్వారా బద్రినాథ్, కేదార్‌నాథ్, మరియు శ్రీలంక యాత్రలకు వి.హెచ్.పి తరపున ఆహ్వానం వచ్చింది. నేను పోలేదు. మూర్తిగారు కూడా పోలేదు.

మూర్తిగారు కూడా నేనున్న ప్రొఫెషన్‌లోనే ఉన్నారు. వీలు దొరికినప్పుడల్లా దేవునికి సంబంధించిన విషయాలను చర్చించుకొనేవాళ్ళం సుమారుగ 5సం॥ల నుండి బయట క్యాంపులు మానేసి లోకల్‌లోనే (హైదరాబాద్‌లోనే) కమర్షియల్ వర్క్ చేసుకొంటూ ఉన్నాను. మూడు సంవత్సరాల క్రితం మూర్తిగారు ఊరెళ్ళి రెండు నెలలపాటు అక్కడే ఉన్నారు. ఆ టైంలోనే మూర్తిగారు నాకు ఫోన్ చేసి, త్రైత సిద్ధాంతము గురించి క్లుప్తంగా చెప్పి, చైతన్యపురిలో ఆఫీసు ఉందని అడ్రసు చెప్పారు. నేను ఇన్ని రోజులుగ అదే ఏరియాలో తిరుగుచున్నా నాకు తెలియలేదు. ఆయన చెప్పిన రోజునే ఆఫీసుకు వెళ్ళాను. అక్కడ లెక్చరర్ శ్రీనివాస్‌గారు పరిచయమయ్యారు. తరువాత నరసింహాచారిగారు వచ్చారు. ఆఫీస్ ఇన్‌చార్జ్ భాస్కర్‌గారు కూడా ఉన్నారు. శ్రీనివాస్‌గారితో కృష్ణానంద మఠం గురించి, కొన్ని విషయాలు, బైబిలు తాలూకు కొన్ని విషయాలు చర్చించిన

అనంతరం శ్రీనివాస్‌గారు నా ఫోన్‌నెంబరు తీసుకోవడం, నేను శ్రీనివాస్ గారి ఫోన్ నెంబరు తీసుకోవడం జరిగినది. నేను మొట్టమొదట "ప్రబోధ" అనే గ్రంథము కొని ఆ రోజునుండి నా జ్ఞాన ప్రయాణాన్ని కొనసాగించాను.

మూర్తిగారు ఫోన్‌చేసి ఇందూ జ్ఞానవేదిక అడ్రస్సు చెప్పినప్పుడు "సుబోధ" అను గ్రంథమును తీసుకొనమని, తరువాత మిగతా గ్రంథములను చదవొచ్చని సూచించారు. ఆ రోజు 'సుబోధ' లేదు. అన్నింటిని పరికించి "ప్రబోధ" గ్రంథమును తీసుకొనివెళ్ళడం జరిగినది. ఆ గ్రంథము చదివిన తరువాత ఒక గొప్ప వ్యక్తికాని శక్తి వ్రాసినట్లు అర్థమయినది. తనకేమి కావాలో అవి దొరికిన ఆనందం తాండవమాడింది నాకేంకావాలో దేనికోసం వెతుకులాడుతున్నానో శ్రీకృష్ణులవారికి తెలియదా? అనిపించింది.

ఐతే ఈ గ్రంథములో తెలుసుకొన్నదేమంటే, ఇంతకుముందు విజయ భాస్కర్‌రెడ్డిగారి ఇంట్లో ఉన్నప్పుడు నేను చేసింది బ్రహ్మయోగమని, తెరిచిన నేత్రం జ్ఞాననేత్రమని, 'అమనస్కపద్ధతి' అని, దర్శించినది ఆత్మనని, చర్మాసనం లేని కారణంగా కొంత పవర్ నష్టపోయానని, ఆత్మదర్శనమవు తున్న టైంలోనే అవి గుండె ఆగిపోయే క్షణాలనీ, వెంటనే పెనుగులాడి బయటపడ్డానని అర్థమయింది. అప్పటి వరకూ దేవుడు రూప, నామ, క్రియారహితుడు అని తెలిసినా, ఆత్మ గురించి ఎక్కడా తెలియబడని కారణం చేతనే ఆ తెల్లని వెలుగునే దేవుని చైతన్యశక్తిగా సంకల్పించడం జరిగినది. త్రైత సిద్ధాంత భగవద్గీతలో స్వామివారు చాలా స్పష్టంగా ప్రతి విషయాన్ని ఆవిష్కరించారు. ఆయనకు తెలియనిదేమున్నది? సర్వాంతర్యామి, అర్జునునికి తన విశ్వరూపం చూపించడానికి జ్ఞాననేత్రాన్ని తెరిపించారు. వేరే భగవద్గీతా గ్రంథములలో మాంసపు కళ్ళు పనికి రావని, వాటి

స్థానములో దివ్యచక్షువులను కళ్ళకు గంతలు కట్టుకున్న విధముగా వర్ణించారు.

తరువాత త్రైత సిద్ధాంత గ్రంథాల మొత్తాన్ని చదవడానికి సంకల్పించి, ఎక్కువ సమయాన్ని కేటాయించడం జరిగినది. అంతా బట్ట బయలు అయినట్లే అయినది. ఈ ప్రక్రియలోనే పది గ్రంథాలు చదివిన అనంతరం, ఘంటువు కీలకమైన అవసరంగా యోచన కలిగి ఇక అక్కడి నుండి చదివే గ్రంథాలనుండి స్వామివారు అర్థాలు చెప్పినటువంటి పదాలనన్నింటినీ సేకరించడం మొదలుపెట్టాను. జ్ఞాన సాధకులమైన మనం గ్రంథాలన్నీ చదివాక, ఎక్కడ ఏ పదమున్నదో దాని అర్థాన్ని గుర్తించడం చాలా కష్టమైన ప్రక్రియ కనుక, వీటి మొత్తాన్ని ఒకచోట పొందుపరచడం మూలంగ, గ్రంథములన్నింటినీ దేవులాడకుండ జ్ఞాన మార్గమునకు ఒక సరళీకృతమైన దారి ఏర్పడి, జ్ఞాన జిజ్ఞాస సాధకులకు సులభముగా, సౌకర్యవంతముగా ఉంటుందని గుర్తెరిగి, సంకల్పాను సారముగా సేకరించి, శ్రీ స్వామివారి అనుమతిని పొంది, గ్రంథముగా మనముందుకు రావడం చాలా సంతోషదాయకం. జ్ఞాన సాధనలో స్వయముగా మనకు ఉపయోగపడడమేకాక, జ్ఞాన ప్రచారములో మనం ఉపయోగించే పదాల కూర్పునకు, జ్ఞానాన్ని బోధించే కార్యక్రమాలలో మారిపోతున్న పదాల అర్థాన్ని విప్పి చెపుతూ, తెలుగు భాషలో అడుగంటుతున్న జవసత్వాల్ని కూడగట్టి ఆచరణలో పెట్టి, పూర్వవైభవాన్ని నిబిడీకృతము చేసి పరిఢవిల్ల చేయాలనే సంకల్పముతో ముందుకు వెళ్ళవలెననే నా భావన.

తరువాత స్వామివారి ప్రసంగాలలోని కొన్ని పదములను కూడా ఇందులో పొందుపరచడము జరిగినది. ఇంకాకొన్ని మిగిలి ఉండవచ్చు

అలాంటి వాటిని కూడ సేకరించి మలిముద్రణలో పొందుపరచడము జరుగు తుందని భావించుచున్నాను.

దాదాపు విడుదలైన గ్రంథములలో సగానికిపైగా గ్రంథపఠన కార్యక్రమములో ఉండగా, ఒక దశలో మనస్సు నిష్కల్మషముగా ఉండడము గుర్తించాను. చాలా ప్రశాంతమైన వాతావరణం శరీరములో తాండవించడం ఒక గొప్ప అనుభూతి, అనుభవం. అంటే మనస్సు ఎరుకలోనే పని చేయడం మానేసింది. కొన్ని సంఘటనలను గుర్తు చేయడంగానీ, మనకు అవసరం లేనటువంటి వాటిని, ఎక్కడో ఎప్పుడో చూచిన వాటిని తెరమీద చూపడం వంటివి మానేసింది. 'శాంతం' అంటే ఏమిటో తెలిసింది. అదే పనిగా జ్ఞాన సముపార్జన నిమిత్తం గ్రంథ పఠనములో ఉన్న కాలంలో పగటి పూట మధ్యలో కునుకు తీయు సమయంలో చాలాసార్లు భుజం తట్టి లేపిన అనుభవం ఆశ్చర్యం కలిగించింది. ఒకసారి అనుకోకుండానే కర్నూలు నుండివచ్చిన విశ్వనాథ్‌గుప్త గారిని మొదటిసారి హైదరాబాద్‌లో మన త్రైత సిద్ధాంత కార్యాలయమువద్ద కలువడము జరిగినది. యోగము గురించి నా అనుభవాలను, తన అనుభవాలను చర్చించుకోవడం జరిగింది. ఆయన తన యోగం గురించి చెప్పుతూ, చర్మాన్ని సేకరించుకొన్నట్లు, ఆ విషయాన్ని స్వామివారికి తెలియజేయగా, శ్రీ స్వామివారు ముందు జ్ఞానాన్ని తెలుసు కోమని చెప్పారని, దానికి తను స్వామివారిని ఒక ప్రశ్న అడిగానని చెప్పారు. ఆ ప్రశ్న ఏంటంటే జ్ఞానాన్ని ఎలా కొలవాలి? కొలమానం ఏమిటి? పరిధి ఎంత? అనే సంశయము. మనకు కూడా జ్ఞానానికి కొలమానం అంటూ లేదు, కనుక మన పరిధిలో ఒక గీటురాయిలాగ, ఎంతవరకు తెలుసుకోవడం అనేది ఇక్కడ ధర్మసందేహం. దానికి స్వామివారు "నీకు ఎప్పుడైతే సంశయాలు లేకుండాపోతాయో అప్పుడే జ్ఞానం లభించినట్లు"

అని శ్రీ స్వామివారు ప్రబోధించారని చెప్పారు. నాక్కూడా చాలా ఆనందం కలిగింది. ఎందుకంటే ఈ సందేహం అందరికీ వస్తుంది కనుక, దీనిని అందరూ అన్వయించుకోవాలని కోరుచున్నాను.

త్రైత సిద్ధాంతములో శ్రీ స్వామివారు వ్రాసిన గ్రంథములలో అన్నీ రహస్యములే, ఇంతకుముందు చదివిన బైబిలు తదితర గ్రంథములలో మాయే బాగా ఉన్నట్లు శ్రీ స్వామివారు వ్రాసిన గ్రంథముల ద్వారా అర్థమవుతుంది. బైబిలు గురించి స్వామివారు కొన్ని గ్రంథములలో ఇచ్చిన విపులీకరణం చాలా గొప్పగా ఉంది. క్రైస్తవములో కర్మలను జన్మలను ఎవరూ నమ్మరు. పరలోకము, పాతాళలోకము (నరకం) అనేవి ఎక్కడో రెండు లోకములు ఉన్నవని పాపం చేసినవాడు పాతాళంలోని నిప్పు కణికల్లో పడి నిత్యమూ కాలుతూ ఉంటాడని బోధిస్తూ ఉంటారు. సాతాను అంటే ఒక ఆకారంతో పోల్చుకొని అదివచ్చి మనిషిని దెయ్యంలాగ పడుతుందని తద్వారా నరకానికి పోతారని చెప్పుతుంటారు. హిందూసమాజంలోని వారు క్రైస్తవములోనికి రావడానికి కారణం వారికి సరైన బోధకులు లేకపోవడం, దేవతలెవరో దేవుడెవరో తెలియకపోవడం, ముఖ్యముగా ధర్మబద్ధంగా జ్ఞానం తెలిసినవారు లేకపోవడం. క్రైస్తవులయితే ఆదివారం పాటిస్తూ, బోధలు చేస్తూ ఉంటారు కనుక అదే కరెక్టనుకుంటారు. క్రైస్తవములో బైబిలులోని జ్ఞానాన్ని వివరించి చెప్పడంకంటే, మొత్తం జన సంఖ్యే ధ్యేయంగా పనిచేస్తూ ఉంటారు.

దేవుని ధర్మములు, జ్ఞాన సంబంధ విషయములు దేవునికి తప్ప ఏ మానవునికీ తెలియదు అనే సూత్రము ఒక మూల గ్రంథములో గలదు. ఆ సూత్రము ప్రకారము దైవజ్ఞానమును ప్రబోధిస్తున్న ఆచార్య ప్రబోధానంద

యోగీశ్వరులవారు స్వయానా కలియుగములో భగవంతుని అవతారముగా, బైబిల్‌లో వ్రాసినటువంటి ఆదరణకర్తగా, అల్లాహ్ అంశనుండి ఉద్భవించిన దేవుని శక్తిగా కొంత గుర్తించవచ్చును. దేవునికి మతమనేదే లేదని, మతమనేది మానవులకే వర్తించునని, భగవద్గీత, బైబిలు, ఖురాన్ గ్రంథములో ఉన్న సారాంశము అంతా ఒక్కటేనని, అది తెలియక నీది, నాది అనే భావంతో కూరుకుపోయి దిశ, నిర్ధేశం తెలియక కొట్టాడుతున్నట్లు సత్యాన్వేషులు త్రైత సిద్దాంత గ్రంథములు చదివి ఒప్పుకోక తప్పదు. ఆ గ్రంథములలోని జ్ఞానశక్తిని, కర్మలను కాల్చే జ్ఞానాగ్నిగా ఒప్పుకోక తప్పదు. పరమాత్మను తండ్రిగా, ప్రకృతిని తల్లిగా గుర్తించడము, మానవ శరీర వ్యవస్థ గురించి, శరీర యంత్రాంగం గురించి, యంత్రాంగం ఉపయోగించే తీరుని, భగవద్గీత (భగవంతుడు గీచిన గీత, హద్దు) లో శ్రీ యోగీశ్వరులవారు విశదీకరించి వ్రాసిన తీరు అద్భుతం. **"త్రైత సిద్ధాంత భగవద్గీత" గ్రంథాన్ని చదివిన వారెవరైనా మాయను అతి సులభంగా జయించి ముక్తిని పొందడం అతిశయోక్తి కాదు.**

అయితే ముందే "దేవాలయ రహస్యములు" అను గ్రంథములో యోగముల గురించి చాలా స్పష్టంగా స్వామివారు తెలియజేశారు. ముక్తి పొందకమునుపే ఆత్మను తెలియవచ్చునని, ఆత్మను దర్శించడమునే దైవ (ఆత్మ) దర్శనమని, శరీరము వదిలి ముక్తి పొందిన తరువాత పరమాత్మ తెలియబడునని ప్రబోధించారు. ఇదే గ్రంథములోనే ఆత్మదర్శనమునకు మొదట జ్ఞానము అవసరమనీ, జ్ఞానము లేనిది యోగము రాణించదనీ చాలా గొప్పగా చెప్పారు గమనించగలరు.

ఈ మధ్యకాలములో నాకు సంబంధించిన గుణాలు, ఆత్మ అదుపాజ్ఞలలో ఉన్నాయని అర్థమవుతోంది. ఇంతకుముందు మనసు మాట

నేను వినేవాణ్ణి. నామాట మనస్సు వినేలా సంకల్పించుకొన్నాను. మనము తెలుసుకొన్న జ్ఞానముతో మనకు ఆచరణ చాలా అవసరం. అసలు ఏ గుణభాగంలో ఉన్నామో తెలుసా? నావరకు నేను చెప్పేదేమంటే, తామసంతో కొంత మిళితమైన సాత్త్విక గుణ భాగంలో ఉన్నానని అర్థమవుతోంది. శరీరములో జోడు ఆత్మలుగ ఉన్న జీవాత్మ, ఆత్మ రెండిటిలో ఆత్మ బ్రహ్మనాడియందు, జీవాత్మ గుణచక్రమందు ఉన్నదని మన గ్రంథముల ద్వారా తెలియుచున్నది. కర్మ ప్రకారము ఏడు నాడీకేంద్రముల ద్వారా ఆత్మ తన శక్తిని ప్రసరింపచేసి శరీరమును నడుపుచున్నది. ఐతే అన్నింటినీ ఆత్మకు అన్వయించకూడదనేది నా భావన. ఆత్మ ఆక్రమించుకొన్న ఈ శరీరము ఆత్మదా? జీవునిదా? ఆత్మ ద్వారా జరిగేపని జీవునిదా? ఆత్మదా? యోచించండి. ఎరుకలో ఉండడం అంటే ఏమిటి? మనస్సు మీద ఆత్మ ద్వారా మనం ఆధిపత్యం చలాయించడమని నా భావన, బుద్ధితో యోచించండి. ఇక్కడ ముఖ్యంగా పరిగణనలోనికి తీసుకోవలసినది ఆగామికకర్మలను అడ్డుకోవడం, ఉన్న కర్మను కాల్చడం. జ్ఞాన సముపార్జన చేత మిగిలిన కర్మను కాల్చడం. మనం ఎల్లప్పుడూ ఏ పరిధిలో, ఏ స్థితిలో ఉన్నామో జ్ఞానముతో బేరీజు వేసుకోవడం అనేదే నా భావన.

జ్ఞాన సముపార్జనలో భాగంగా "మంత్రము–మహిమ" అనే మన గ్రంథము చదవడము జరిగినది. ఈ గ్రంథము చదవక ముందు దాకా అసలు ఆ మంత్రముల గురించి అవగాహనగానీ, ఆసక్తి లేకపోగా వాటిని పూర్తిగా నమ్మేవాడినికాదు. వాటి గురించి కొంత తెలుసుకోవాలనే ఆసక్తి కలిగింది. దాంతో ఇంతకుముందు శ్రీ స్వామివారు చెప్పినటువంటి "మనో నేత్రం" కూడ తెరచి, దేవతలను, దేవతాశక్తిని చూడటం జరిగినది. వాళ్ళు మానవులకంటే శక్తిమంతులని, వాళ్ళు కూడా దేవుని బిడ్డలేనని

తలంచి గౌరవించి, వాళ్ళ సహాయం కోరి, జ్ఞాన ప్రచార సంబంధమైన అడ్డంకులను తొలగించుకొనేందుకే, సంకల్పించి అలా చేయడం జరిగినది. తరువాత ఆపివేయడం జరిగింది. ఇక్కడ సంకల్పమే ప్రధానం.

జ్ఞానం తెలియకముందు ఉన్న మనిషికీ, జ్ఞానమార్గంలో ఉన్న మనిషికీ ఎంత తేడా ఉంటుందో అర్థమవుతుంది. మాయా గుణముల ప్రభావము చేత ప్రభావితమై మనిషి సంచరిస్తాడు. జ్ఞానమార్గములో ఉన్న మనిషిని ప్రభావితం చేయడానికి మాయ ప్రత్యేక యంత్రాంగమునే తయారు చేసుకొంటుంది అనేది నా భావన. ఈ ప్రపంచములో మాయ చేయలేని పనిలేదు. జ్ఞానమార్గములోనున్న మనిషి ఏ గుణ భాగంలో ఉన్నాడో గమనించి, కసరత్తు చేసి దానికి సంబంధించిన సాఫ్ట్‌వేర్ మాయ తయారు చేసుకొంటుందనేది నా భావన. ఐతే దైవజ్ఞాన పరిధి విషయములో దేవునిశక్తి ముందు మాయ ఒకరకంగా దిగదుడుపే. మామూలు మనిషికంటే జ్ఞానమార్గములోని జ్ఞాని, మాయకు పంటిక్రింద రాయిలాంటి వాడు. ఈ విషయములో జ్ఞానులు చాలా జాగ్రత్తగా ఉండవలెనని కోరుచున్నాను. స్వామివారు వ్రాసిన గ్రంథములలో "మమ మాయా దురత్యయా" అని బహుముఖంగా చెప్పడం ఎందుకో, నా అనుభవములో అర్థమవుతోంది.

నాకు జరిగిన ఒక అనుభవాన్ని తెలియజేస్తాను. 2013 యుగాది రాత్రి కావచ్చు. అర్ధరాత్రి (నా మనస్సు) నిద్రించుచున్న టైంలో ఇంటి తలుపు కొట్టి, మనుషులను మనిషి లేపినట్లుకాక, ఆత్మను ఆత్మే తట్టి లేపిన అనుభవం. అది సూక్ష్మమో ఇంకోటో తెలియదు. కలకాదు. రూంలో బెడ్‌లైట్ వెలుగుతోంది. చాలా స్పష్టంగా తెలుస్తోంది. అది మనిషి ఆకారం. నా ఆత్మ స్పందించలేదు. ఆ ఆకారం ఏకంగా స్థూలశరీరం కాకుండ సూక్ష్మశరీరము. అక్కడ జీవునికి అనుభవం కలుగుతోంది. ఆ సూక్ష్మ

శరీరం నా శరీరమును ఆక్రమించుకొను నిమిత్తం పోరాటం జరుపుతోంది. దానికి ధీటుగా ఆత్మ అడ్డుకొని ప్రతిగా పోరాటం చేస్తూ పడుకొని ఉన్న నా ఆత్మ పైకి లేచి "రేయ్! నేనెవర్ననుకుంటున్నావురా! జ్ఞానినిరా! ఇప్పుడు నిన్నేంచేస్తానో చూడు" అంటూ గతంలో యోగంలో తెరిచినట్లే జ్ఞాననేత్రాన్ని తెరచి (రెండు కనుబొమ్మల మధ్యనుండి) శక్తిని ప్రసరింపచేయగా తెల్లని వెలుగు బయటకొచ్చింది. ఈ లోపు ఆ సూక్ష్మం నేను నిలబడినప్పుడు నా వెనుక భాగానికి వచ్చి ముందుకు తోస్తోంది. జ్ఞాననేత్రమునుండి తల వెనుక వచ్చిన శక్తి ప్రసారమై ఆ ఆకారంపై పడగా ఆ శక్తి ధాటికి తట్టుకోలేక ఆ ఆకారం నన్ను వదలి పారిపోయింది. ఇది చాలా స్పష్టంగా కనిపిస్తోంది. కానీ ఆ చిన్న వెలుగులో ఆ వచ్చిన ఆకారాన్ని ఎవరైనది గుర్తించలేక పోయాను. కాసేపటికి మనస్సు మేల్కొనడం జరిగినది. చిన్నగా కళ్ళు తెరిచాను. నేను ఎలా పడుకొన్నానో అలాగే ఉన్నట్లు గుర్తించాను. స్థూల సంబంధమైన ఏ అలికిడిగానీ, ఏమీ కనిపించలేదు. మెలకువలో కూడా అదే స్పష్టత అదే పోరాటం కళ్ళ ముందు కదలాడింది. వచ్చింది సూక్ష్మమో, ఇంకోటో నాకు తెలియదు. నా శరీరాన్ని ఆక్రమించుకొన్న నా ఆత్మ పోరాటాన్ని చాలా స్పష్టంగా చూశాను. అది నా ఆకారంలోనే చాలా స్పష్టంగా కనిపించింది. నా ఆత్మ ఆ సూక్ష్మంపై మాటల రూపంలో ప్రయోగించిన పదజాలం నాకు ఆశ్చర్యం కలిగించింది. కొంత జ్ఞానశక్తి నాలో ఉన్నట్లు గుర్తించాను.

రెండు సంవత్సరముల క్రితం పని నిమిత్తం ఒక మనిషిని తీసుకొని మహబూబ్‌నగర్ జిల్లా ఆత్మకూరు అనే ఊరికి వెళ్ళడం జరిగినది. మేము వర్క్ చేసేది ఊరికి 2 కిలోమీటర్ల దూరంలో, ఒక దేవతా గుడికి బొమ్మలు వ్రాయడం కొరకు వెళ్ళి అక్కడే ఒక 20 రోజులపాటు ఉండడం జరిగింది.

రోజూ కాలినడకన భోజనం కొరకు, నీళ్ళ బాటిల్ కొరకు ఊరిలోనికి పోయి వచ్చి గుడిదగ్గరే పడుకొనేవాళ్ళం, అక్కడే ఒక బ్రాహ్మణ పూజారి కుటుంబం కూడా ఉన్నాది. ఒక రోజు ప్రొద్దున్నే లేచి, నేనూ, నా వెంటనే ఉన్న వీరయ్య అనే ఒకతను పళ్ళు తోముకొనేందుకు రోజు మాదిరిగానే నేను వేపపుల్ల నిమిత్తం గుడికి కొంత దూరంలో ఉన్న చెట్టు దగ్గరకు వెళ్ళాను. నా వెంటవున్న వ్యక్తి కూడా రోజు మాదిరిగానే తంగేడు పుల్ల కొరకు పొదలా ఉన్న చెట్టు మొదల్లో చేయిపెట్టగా కొండతేలు కాటు వేసింది. ఈ లోపు నేను వేపపుల్ల సేకరించి పళ్ళు తోముతున్నా. అతను "అబ్బా!" అన్న శబ్ధము విని ఏంటని అడిగా "తేలో ఏదో కుట్టింది". అంటూ కుట్టిన చేతిని ఇంకో చేత్తో పట్టుకొని బాధగా మూల్గుతున్నాడు. ఆ ఏరియా చిన్న చిన్న తుప్పలు చెట్లతో కూడిన ఊరి బయట అటవీ ప్రాంతం, క్రితం రోజు విషపు తేలు కరచి ఒక బాలుడు చనిపోయినట్లు పేపర్లో నేను చదవడం జరిగింది. ఆ సంఘటన జరిగింది కూడా ప్రక్క ఊరిలోనే. అప్పుడేం చేయాలో పాలుపోలేదు. అప్పటికే విషం భుజము క్రింద సంకదాక ఎక్కినట్లు చెప్పి విపరీతమైన బాధ కలుగుతోందని నన్ను హైదరాబాద్ పంపించవలెనని మొరపెడుతున్నాడు.

వెంటనే మన స్వామివారు వ్రాసినటువంటి "సత్యాన్వేషి" అనే గ్రంథం గుర్తొచ్చింది. వెంటనే నేను వేపపుల్ల తాలూకు వేపాకును తీసి కొంత వేపాకును అతనికి ఇచ్చి నమిలి ఎలాగుందో చెప్పమన్నా. అతను నమిలి తియ్యగా ఉంది అన్నాడు. అతన్ని గుడిదగ్గరకు తీసుకువెళ్ళాను. అక్కడ వాచ్‌మెన్‌గా ఉన్న ఒకతన్ని రావిచెట్టు గురించి అడిగా. ప్రక్కనే పొదల్లో ఉన్న చిన్న రావిచెట్టును చూపించాడు. ఆ చెట్టు చిన్నదైనా దానికున్న ఆకులు సరిపోతాయని గ్రహించి అతన్ని వెల్లికిలా పడుకోబెట్టి, ఆకుల

తొడిమలను చెవిలో పెట్టి విషం తీయడం జరిగినది. తేలు కుట్టినతనికి కూడా ఆశ్చర్యం కలిగింది. తేలువిషం సంకలోకెక్కిన తరువాత తను చనిపోతాననే అనుకొన్నాడట. తరువాత ఎలా విషం పైకెక్కిందో అలాగే ఆకులు పెట్టినప్పుడు క్రిందికి దిగిందని అతను చెప్పాడు. ఒక గంట విశ్రాంతి తీసుకోమని చెప్పా. తరువాత పనిమీదికి వచ్చాడు. అక్కడ ఉన్న పూజారులైన బ్రాహ్మణ కుటుంబ సభ్యులు కూడా ఆశ్చర్యానికి గురయ్యారు. మూమూలుగ తేలు కుడితే 24 గంటలు ఆ బాధ ఉంటుంది గదా! పూర్తిగా బాధ లేకుండా పోవడం ఆశ్చర్యమే అన్నారు. ఇక్కడ పాములు కూడా ఎక్కువగా తిరుగుతూ ఉంటాయి. ఈ చిట్కా మాకు బాగా ఉపయోగపడుతుందంటూ పొగిడారు.

తరువాత ఇంకా చాలా సంఘటనలను, నా చుట్టూ ఉన్న కొంత మంది దెయ్యాలబారిన పడిన బాధితులను, (వాళ్ళ ఉనికిని) గమనిస్తూ జ్ఞానశక్తిని కూడగట్టుకొనే పనిలో నిమగ్నమై సాగిపోతున్నందుకు నాకు చాలా ఆనందం కలుగుతోంది. అంతే తృప్తి, శాంత స్వభావం అనుకోవచ్చు. ఇలా ఎందుకు చెప్తున్నానంటే గుణాలన్నీ అదుపులోనే ఉన్న కారణంగా సంతోషము, దుఃఖము అనే వాటికి తావు లేకుండా పోయింది. రెండింటినీ సమంగానే భావిస్తున్నా. కొన్ని విషయాల్లో నాకే ఆశ్చర్యం కలుగుతూ ఉంటుంది.

**“శ్రీకృష్ణుడు దేవుడా? భగవంతుడా?”** అనే గ్రంథములో మీరాబాయి గురించి శ్రీ స్వామివారు వ్రాసిన యదార్థాన్ని చదువుతూ ఉంటే అత్యంత ఉన్నతంగా నా హృదయం ద్రవించిపోయింది. ఒక తండ్రి దగ్గర చిన్నపిల్ల వాడు ఎలా ఏడుస్తాడో, అలాగే చిన్నపిల్లవాడిగా శ్రీకృష్ణులవారి పాదపద్మ

ములను సాకార రూపములోనున్న భగవంతునిగా, ఆదరణకర్తగా, సర్వాంత ర్యామిగా శ్రీశ్రీశ్రీ ఆచార్య ప్రబోధానంద యోగీశ్వరులవారి పాదపద్మము లను గుర్తుచేసుకొని నా తండ్రిగా భావించుకొని విపరీతంగా ఉద్వేగంతో ఏడ్చేశాను. చిన్నపిల్లవాడిగా ఉన్న కాలంలో నేనెలా ఏడ్చేవాడినో గుర్తులేదు కానీ, ఊహ తెలిసిన తరువాత ఇలాంటి సంఘటన అదృష్టంగానే భావిస్తున్నా.

శ్రీశ్రీశ్రీ ఆచార్య ప్రబోధానంద యోగీశ్వరులవారి దర్శనము మరియు జ్ఞానశక్తిని సముపార్జించుకొనే అవకాశము నాకు కలిగినందుకు పోయిన జన్మ సుకృతము, అదృష్టముగా భావిస్తున్నాను. త్రైత సిద్ధాంతమును తెలియని ముందువరకూ ఉత్త ఊకదంపుడు కార్యక్రమముగానే మిగిలి పోయింది. ఇప్పుడు ఒడ్లుదంచే కార్యక్రమము మొదలయ్యిందనే భావిస్తు న్నాను. అంటే ఎవరు ఎన్ని ఒడ్లు దంచితే అంత జ్ఞానాన్ని సంపాదించుకొనే అవకాశాన్ని వినియోగించుకోవాలని, చెప్పొకచోట కాలొక చోట లేకుండా, జాగరూకులై, ఎరుకలో ఉండి జ్ఞానశక్తి సముపార్జనలో పోటీపడుతూ ముందుండాలని కోరుతూ, కుల, మత, వర్గ, వర్ణ బేధములు లేకుండా అంతా ఇందూ దేశముగా ఆవిష్కరింపజేయాలని కోరుతూ, ఈ అమూల్యమైన అవకాశాన్ని ఇచ్చినటువంటి శ్రీశ్రీశ్రీ ఆచార్య ప్రబోధానంద యోగులకు, ఈశ్వరుడైన యోగీశ్వరుల వారి పాద పద్మములకు నమస్కరిస్తూ నా ఈ చిన్న అనుభవాలను ముగిస్తున్నాను.

ఇట్లు

**దేవునిబిడ్డ**

**బుడంగుంట్ల యోహాను.**

# నా విన్నపము

ఈ నా జ్ఞానసముపార్జన దిశగా ప్రయాణిస్తున్న ఈ మధ్య కాలంలో నాకు చాలా బాధకలిగించిన విషయము ఏంటంటే, హైదరాబాద్‌లోని ఇందూ జ్ఞానవేదిక కార్యాలయములో హిందూ రక్షకులమని చెప్పువారు కొందరు దాడి చేయడం విస్మయపరిచింది. శ్రీస్వామివారు ఈ విషయాన్ని పలు గ్రంథములలో అనేకసార్లు వివరించి విచారం వ్యక్తం చేయడం చాలా బాధ కలిగించింది. అక్కడ దాడిలో పాల్గొన్న హిందూ రక్షకులమను వారితో కూడా కొన్ని చోట్ల కలిసినప్పుడు నేను మాట్లాడడం జరిగినది. మాట్లాడిన వారు స్వామివారి గురించి, గ్రంథములలో ఉన్న సారాంశము గురించి సావధానం గానే అడిగి వాళ్ళ సందేహములను కూడా అడిగి నివృత్తి చేసుకొన్నారు. అప్పుడు నేను ఒక వ్యక్తితో **"మనది ఇందూ (జ్ఞానము కలిగిన) దేశము. "హిందూ" అంటే అర్థం లేదు. మనదేశం పూర్వము నుండీ ఎంతోమంది యోగులు, జ్ఞానులు, ఋషులు, మునులకు నిలయమైనది. పూర్వం జ్ఞానంతో నిండుకుండలా ఉండేది. ప్రపంచ దేశములకు మనదేశము తలమానికముగా ఉండుట వలన, ప్రపంచ దేశములన్నీ ఇందూ దేశముపై అనాదిగా భక్తిభావము గౌరవ ప్రవృత్తులు కలిగి ఉండేవి. అయితే కాలక్రమేణా అంతరించిపోతున్న ఈ సమాజములో జ్ఞానులూ, యోగులూ లేకుండా పోయారు. ఇందూ ధర్మములను చెప్పే నాథుడే లేక అజ్ఞానములో మునిగి తేలుతూ, ఇందూ ధర్మములు, సాంప్రదాయములు అడుగంటి ఒట్టి పోతున్న ఈ తరుణంలో, ఈ అజ్ఞానాంధకారములో ఒక గొప్ప జ్ఞాన నక్షత్రం ఉద్భవించినదనీ, ఆయనే శ్రీశ్రీశ్రీ ఆచార్య ప్రబోధానంద యోగీశ్వరులనీ కలియుగములో ఇది ఒక అద్భుతమనీ, అజ్ఞానాంధకారాన్ని తరిమి జ్ఞానశక్తితో తిరిగి నిండుకుండలా ఇందూదేశముగా మార్చే అవసరంగా భగవంతుని అవతారమనీ"** చెప్పడం

జరిగింది. తరువాత ఆయన ఆర్.యస్.యస్ అని, పరిచయం చేసుకొన్నాడు, నా పేరు యోహాను అని, ఆర్టిస్ట్‌గా పరిచయం చేసుకొన్నాను. ఆయన ఆశ్చర్యపోయాడు, ఆయన ఉద్దేశ్యం ఏమంటే అందరూ క్రిష్టియానిటీలోనికి పోతుంటే, క్రిష్టియానిటీ నుండి ఇందూ మతములోనికి వచ్చినట్లు చాలా ఆశ్చర్యం వ్యక్తం చేశాడు. త్రైత సిద్ధాంతం మంచిదేనని పొగిడి సెలవు తీసుకొన్నాడు. కొన్నిచోట్ల వి.హెచ్.పి, ఆర్.యస్.యస్ లో నాకు తెలిసి, చాలామంది విజ్ఞులు, చదువరులు, మేధావులు హిందూ సంరక్షకులుగా ఉన్నారు. వారిలో అందరూ కాకుండా కొంతమంది వారి స్వార్థ బుద్ధితో న్యాయాన్యాయాలు, ధర్మాధర్మములతో పని లేకుండా గుడ్డెద్దు చేలోపడ్డ సామెతగా (సమత) గా ప్రవర్తిస్తున్నారు. వారికి ఈ గ్రంథము మూలంగా నేను చెప్పేదేమంటే, ఒక వ్యక్తి ఫలానా ఊరు పోవడానికి దారి అడిగాడు, మీకు తెలియకపోతే తెలియనట్లే ఉండండి. దారి చెప్పి, మార్గాన్ని చూపించడం తప్పా? ఆ ఊరి గురించి తెలియకపోతే తెలుసుకోండి. దారి చెప్పేవాళ్ళను అడ్డుకోవడం ఏ న్యాయం? ఏ ధర్మం, ఏ సంస్కృతి? బుద్ధి యోచన పని చేయదా? అని అడుగుతున్నాను. న్యాయం తెలియదు, ధర్మములు తెలియదు. 'హిందూ' అంటే ఏమిటో, 'ఇందూ' అంటే ఏమిటో తేడా తెలియదు. ప్రజలకు ఇందూ ధర్మములనూ, సాంప్రదాయములను బోధిస్తున్నారా? దాడులు చేయడం ద్వారా మతమార్పిడిని అడ్డుకోవడం సాధ్యపడుతుందా? సరే, మీకు చేతకాదు. చెప్పేవాళ్ళను అడ్డుకోవడానికి మీకు అర్హత ఉందా? అని అడుగుచున్నాను. గాడిదకూ, గుర్రానికీ తేడా తెలియనప్పుడు గాడిదపై స్వారీ చేస్తామంటే ఎలా? ధర్మబద్ధముగా, శాస్త్రానుసారంగా ఇందూ ధర్మములను ప్రచారం చేసి, పూర్వ వైభవ దిశగా ఇందూ అంటే "జ్ఞాని" అని తెలియజెప్పి ఇందూదేశము జ్ఞానుల దేశమై

ప్రపంచ దేశములకు కనువిప్పు కలిగించే దిశగా సాగే ఈ ప్రస్థానంలో మీ పాత్ర ఏమిటో విజ్ఞతతో, బుద్ధితో యోచించండి. స్వామి వివేకానంద జీవిత చరిత్ర పుస్తకములయినా చదివితే కొంతయినా బుద్ధి వికసిస్తుందని భావిస్తున్నా, మీరు జ్ఞానుల దేశములో అజ్ఞానులుగా ఉండాలను కుంటున్నారా? మతమార్పిడిని అడ్డుకోవడానికి భౌతిక దాడులు పని చేయవు. అవి అజ్ఞానముతో కూడుకొన్నవి. అసలు దీనికి మూలమెక్కడో తెలుసా? అని అడుగుతున్నాను. "ముల్లును సూదితో తీయాలి" అనే సూత్రము ప్రకారము "అజ్ఞానాన్ని జ్ఞానముతోనే తీయాలి." ఇదే సూత్రంతో ముందుకెళ్ళితే మన సంకల్పం కరతలామలకం అవుతుంది. విజ్ఞాన వంతులు, విజ్ఞులు వివేకంతో విశాల హృదయంతో వెతికినట్లయితే, మీరు తలపించిన కార్యాన్ని మేము చేస్తున్నందుకు మీరు సిగ్గుపడక తప్పదు. ప్రజలకేగాని దేవునికి మతమనేదే లేదనీ, అన్ని మత గ్రంథాలలో ప్రబోధించినటువంటిది దేవుడు ఒక్కడేనని, దేవుడు రూప, నామ, క్రియా రహితుడని, జీవుడు దేవున్ని చూసేది ముక్తిని పొందినప్పుడేనని, మన కళ్ళ ముందు కనిపించేవారంతా దేవతలనీ, ఏ మానవుడైనా దేవతగా అవతారం ఎత్తవచ్చునని, ముందు మీరు తెలుసుకోవడం అత్యంత ఆవశ్యకం. కనుక మేము కనుగొని గొప్ప సంకల్పముతో ఇందూ దేశము దైవజ్ఞానులతో శోభిల్లే దిశగా సాగుతున్న దైవజ్ఞాన ప్రచారంలో సహకరించకపోయినా ఫరవాలేదు కానీ, అడ్డుకొనే కార్యక్రమాలను మాని, అజ్ఞానానికి చరమగీతం పాడుతున్న దైవజ్ఞానులను ప్రోత్సహించాలని హృదయ పూర్వకముగా కోరుకొంటున్నాను.



# త్రైత సిద్ధాంత ఆధ్యాత్మిక ఘంటు

## అ, అం

అజ్ఞానము = తెలియని తనము.

అర్థార్థులు = డబ్బుకొరకు మ్రొక్కువారు.

అవ్యక్తా = గోచరము కానివాడు, వ్యక్తము కానివాడు.

అచేలము = జ్ఞానము (జన్మలేని స్థితి), బట్టబయలు, తెరలేని దృశ్యము.

అక్షయము = నాశనము కానిది, క్షయము లేనిది.

అవధూత = సాకారముగ ఉన్న భగవంతుడు, ఎల్లలులేని పరమాత్మ జ్ఞానమును తీసుకొని వచ్చెడువాడు, దేవునివద్ద నుండి వచ్చినవాడు, దేవుని సమాచారముతో వచ్చినవాడు (అవధిలేని పరమాత్మను తెలుపువాడు)

అచర = మార్పు చెందనటువంటి, కదలిక లేనిది.

అవ్యయము = నాశనము లేనిది, వ్యయముకానిది, ఖర్చుకానిది.

అక్షరుడు = ఆత్మ (క్షరుడెక్కడకలడో అక్కడ వానితో కలిసి ఉండువాడు.) నాశనము లేనివాడు, (సర్వజీవ శరీరములందు కలవాడు).

అవతారము = పరమాత్మ అంశ శరీరమును ధరించడము.

అధ్యయనము = వెనుతిరిగి చూచుకోవడము; తిరిగి చదువుకోవడము.

అక్షలు = నాశనము లేని స్థితి.

అక్ష = నాశనము లేనిది, బలహీనత లేనిది (సుఖములు). అంత్యకాలము, మోక్షము.

అంత్యకాలము (ప్రళయదినము) = శరీరము నశించి మరణము ఏర్పడిన దినము, కర్మ నశించి మోక్షము పొందిన దినము.

అక్షింతలు = నాశనము లేని దైవశక్తితో కూడుకొని ఉన్నవి.

అనగ = అర్థము ఇచ్చునది, భావము తెలియజేయునది.

అనగనగనగ = పరమాత్మకు గుర్తు, చూడలేము కానీ ఎదుటే ఉన్నది. భాషకందనిది, కానీ అంతటా వ్యాపించి ఉన్నది. పురాతనమైనది.

అగ్ని (జ్ఞానాగ్ని) = కర్మలు అను కట్టెలను కాల్చునది; కర్మను నాశనము చేయునది.

అందము = స్థూల శరీరమునకు సంబంధించినది, కనిపించే రూపము.

అకర్మ = ప్రారబ్ధకర్మ ఆచరణ ప్రకారం పనులు జరుగు చున్నప్పటికీ క్రొత్త కర్మ రాకుండాపోవడము (కర్మయోగులకు)

అ = అడ్డు కలిగించునది, నివారించునది, లేనిది.

అనువాదము = మొదటిదానిననుసరించి వివరముగ చెప్పుట. సమానముగా మార్పు చేయునది.

అంతకమ్ = అంతమైపోయినది, ఏమాత్రములేనిది.

అగ్నితత్వములు = కన్నులు, చెవులు, చర్మము, నాలుక, ముక్కు (జ్ఞానేంద్రియములు)

అచేతన ప్రకృతి = ఆకాశము, గాలి, అగ్ని, నీరు, భూమి. (అచర)

అవిద్య = తెలుసుకోకపోవడము, తెలియని తనము.

అర్థి = అడుగువాడు.

అర్థించు = అడుగు.

అనుదాత్తము = నీచము, క్రిందిది, నీచమైనది.

అంజనాదేవి = ఆంజనేయుని తల్లి.

అవిద్యావరుడు = ఆత్మజ్ఞానములేనివాడు, ఏమీ తెలియనివాడు.

అమనస్కపద్ధతి = జీవుడు కుంభించి శ్వాసను నిలుపకనే యోగములో శ్వాస తనంతటతాను నిలిచి పోయి, లోపల ఉన్న వాయువులన్నియు ఏకము కావడము, వేరొక ప్రాణాయామము. మనస్సును లేకుండా చేసుకోవడము.

అమా (అమ్మా) = నీవుకానిది (ప్రకృతి).

అబ్బ = తండ్రి, పరమాత్మ

అవ్యవసాయం = పండునది కాదు, శాస్త్రబద్ధమైనది కాదు, జరగనిది, అసత్యము, వ్యాపించనిది.

అన్నము = కూడు, ఆహారము.

అజ్ఞానులు = సూర్యవంశమునకు చెందిన భానుమతులు.

అనాలోచితము = పరమాత్మ (ఎప్పటికీ, ఎవరికీ, దేనికీ తెలియబడని వాడు.) ఆలోచనకు అందనిది.

అరిషట్ వర్గము = ఆరు శత్రువుల గుంపు (కామ, క్రోధ, లోభ, మోహ, మద, మత్సరములు)

అరి = శత్రువు, (షట్ = ఆరు), (వర్గము = గుంపు.)

అజోపి = పుట్టుకలేనివాడు (జ్ఞాన యోగము 6వ శ్లో॥) జన్మే లేనివాడు.

అబద్ధ = దేనికీ కట్టబడిలేదు, దేనికీ బంధింపబడిలేదు, దైవము.

అర్థార్థి = అర్థము కోసము ఆర్థించువాడు, ధనమును అడుగువాడు.

అర్థము = డబ్బు, ధనము, ఉపయోగపడునది, అవసరమును తీర్చునది.

అమృతము = నాశనములేనది, మరణములేనది (పరమాత్మ), ఆత్మ.

అజ్ఞుడు = తెలిసినవాడు, ఎరిగినవాడు, గ్రహించినవాడు.

అక్క = ప్రకృతి, జీవునికంటే ముందు పుట్టినది.

అల్పభూతముల శక్తి = పరిమితము, జీవుల బలము.

అత్య = జీవింపజేయడము.

అస్త్రశక్తి = సూక్ష్మమంత్ర ఆయుధ శక్తి.

అస్త్రము = సూక్ష్మశక్తితో కూడిన ఆయుధము.

అపవిత్రాత్మ = దయ్యము, పవిత్రతలేని జీవులు.

అపోస్తలు = భక్తులు, అపోహలు లేనివారు, అనుమానము లేనివారు, నమ్మినవారు.

| | | |
|---|---|---|
| అద్వైతము | = | ఒకే పరమాత్మ గురించి చెప్పినది, రెండు కానిది. |
| అహము | = | శరీరములోని ఒక భాగము, అంతఃకరణము (గుణము కాదు.) |
| అండజ, పిండజ | = | జీవులు (జంతువులు, మనుషులు, పక్షులు పాములు), గ్రుడ్డునుండి పుట్టినవి, పిండమునుండి పుట్టినవి. |
| అతివాదము | = | అందివ్వబడిన జవాబు సరియైనదైనా దానిని ఒప్పుకోక కాదని మొండిగా వాదించడము. |
| అంగము | = | భాగము, శరీరము. |
| అవధి | = | ఎల్లలు లేనిది, హద్దులేనిది, అంతటా వ్యాపించినది, పరమాత్మ. |
| అసత్తు | = | జీవాత్మ. |
| అంగీ | = | శరీరమును ధరించినది. |
| అర్ధాంగి | = | భార్య, జీవిత భాగస్వామి. |
| అశ్వర్థ వృక్షము | = | మానవశరీరము; తలలోని కర్మ, కాల, గుణచక్రములు మూలముకాగా, శరీరమంతా విస్తరించిన నాడులు కొమ్మలుగా జ్ఞానేంద్రియములు ఆకులు కాగా, కర్మేంద్రియములు కాయలుగా ఉన్నవి. ఈ వృక్షమునకు పైకి వేర్లు, క్రిందికి కొమ్మలు కలవు. ఈ చెట్టుకు అనేక విధముల కాయలు కాయును. దీని ఆకులు వేదములకు ప్రతిరూపము. |
| అంత్రము | = | అంత+రము లోపల నాశనము చేయునది. (అంత్రము వ్రాతగాయుండును.) |

అనాత్మ = ఆత్మకానిది, పరమాత్మ.
అంగ సేవ = గురు శరీర ఆరోగ్యమును, పోషణను చూచుట.
ఆత్మ సేవ = గురువు చెప్పిన దానిని వినడము.
అపౌరుషములు = పురుషత్వములేనివి, అధర్మములతో కూడుకొన్నవి.
అనాలోచితము = పరమాత్మ, దీర్ఘముగా కూడా చూడలేము.
అష్టమి = శ్రీకృష్ణ భగవానుడు పుట్టిన దినము, జ్ఞానము, అజ్ఞానము రెండు నాలోనే ఉన్నాయన్నట్లు మరియు జ్ఞానమునకు, అజ్ఞానమునకు నేనే (శ్రీకృష్ణ భగవానుడు) మార్గమును, నేనే ద్వారమును అన్నట్లు తెలియజేయు (సంధిలాంటి) దినము.

## ఆ

ఆత్మ = అణిగి ఉన్నది, జీవునికి మేనమామ (సూక్ష్మంగా ఉండేది.) గుప్తముగాయున్న చిత్రగుప్తుడు, పరమాత్మకు ప్రతినిధి, జీవాత్మకు అధిపతి, హృది. నిన్ను నడుపువాడు. అన్నీ చేసేవాడు, ప్రకృతికి తమ్ముడు, నిన్ను తోలేవాడు.
ఆర్థులు = ఆపదలయందు మ్రొక్కువారు.
ఆది మధ్యాంత రహితుడు = మొదలు, నడుమ, చివరలు లేనివాడు.
ఆత్మసాక్షాత్కారం = ఆత్మదర్శనము, పొరుగువానిని తెలియడము, శరీరమునకు అధిపతియైన వానితో స్నేహము చేయడము.
ఆధ్యాత్మికము = జ్ఞానమార్గము (ఆత్మను గూర్చి తెలుసుకోవడము)

ఆత్మను అధ్యయనము చేసి తెలుసుకొను విధానము, ధర్మయుక్తముగా, శాస్త్రబద్ధముగా ఆత్మను తెలుసుకొనుట.

ఆది = జీవుడు జన్మించు సమయము, మొదలు, బుద్ధికి తెలియనిది.

ఆలిబొట్టు (తాళిబొట్టు) = పురుషాధిక్యతను తెలియజేయు గుర్తింపు.

ఆడ = అడ్డము, స్త్రీ, ప్రకృతి, మాయ.

ఆడవారు = ప్రకృతి వైపువారు (ప్రకృతివైపు ఉన్న స్త్రీ, పురుషులందరికీ ఆడవారను పేరు వర్తిస్తుందని తెలియాలి.)

ఆదివారము = ప్రపంచము ఆదిలో మొదలైన దినము, మొదటి దినము, సూర్యుని దినము, సృష్ఠి జరిగిన దినము, సృష్ఠి జ్ఞానముకు గుర్తుగాయున్న రోజు, దేవుని ఆరాధన కొరకు పనులు మాను దినము. (ఆదివారముతో మొదలగుట వలన పూర్వము ఆ దినము అందరికీ “పండుగ”లాగ ఉండెడిది. ఆ దినము పనులు మాని సంతోషముగ కాలము గడుపుచూ, పిండివంటలు చేసుకొని దేవునికి నైవేద్యము పెట్టి తాము తినెడి వారు. ప్రతి ఆదివారము పండుగ వాతావరణము కలిగి ఉండెడిది.)

ఆయువు = వాయువు, శ్వాసతో కూడిన ఆయుష్షు.

ఆత్మశక్తి = చైతన్యశక్తి, సత్తు, కదలిక శక్తి (కుండలిని), జీవున్ని నడుపు శక్తి.

ఆలోచన = బుద్ధితో చూడడము, లోతుగా చూడడము, మనస్సు జ్ఞాపకముతో ప్రారంభమగునది.

ఆలోచితము = శరీరములోని ఆత్మ, యోచనకు అందనిది.

ఆత్మజ్ఞానము = ఏ కల్మషములేని పవిత్ర పరిశుద్ధ జ్ఞానము, నీకు నీ శరీరమునకు అధిపతిని గురించి తెలుసుకోవడము.

ఆకృతి = ప్రకృతి చేత చేయబడినది (ప్రకృతి అందాలు.) ఆకారము గలది.

ఆహారము = శరీర పోషణ నిమిత్తము పోషక పదార్థములున్నది.

ఆస్తికులు = దైవ భూషణులు, విశ్వాస ధనము కలవారు.

ఆకలి = నాశనముతో కూడుకొన్నది, ఆహారము కొరకు గుర్తు చేయునది.

ఆశ్రమము = బ్రహ్మవిద్యను నేర్పించు నిమిత్తము నెలకొల్ప బడినది ఆశ్రమము, జీవున్ని మాయనుండి కాపాడి ఆశ్రయమిచ్చునది.

ఆలోచన = అనేకమార్లు వస్తుంది, ఎడతెరపి లేకుండా వస్తుంది.

ఆయుధమ్ = మనిషియొక్క ఆయుష్షును నాశనము చేయునది.

ఆత్మహత్య = ఒక మనిషి ఇంకొక మనిషినిగానీ, జంతువును కానీ చంపినట్లయితే అది ఆత్మహత్య అగును. జీవాత్మ వెంట ఆత్మపోవడము. (జ్ఞానరీత్యా శాస్త్రబద్ధము.) తన్నుతాను చంపుకోవడము

(ప్రాపంచికము) తన ఆత్మను చంపుకోవడము (దైవికము).

ఆది గుణము = గుణరహిత మధ్య భాగము (యోగము) ఆత్మ.

ఆదిత్యుడు = సూర్యుడు (జ్ఞానము చెప్పడములో మొదటివాడు.)

ఆకాశతత్త్వములు = జీవుడు, మనస్సు, బుద్ధి, చిత్తము, అహము (అంతః కరణములు) (చరప్రకృతి, చేతన ప్రకృతి)

ఆధార చక్రము నడుపు శ్వాసల సంఖ్య = 600 (ఆరువందలు)

అనాహత చక్రము నడుపు శ్వాసల సంఖ్య = 6000 (ఆరువేలు)

ఆగ్నేయ చక్రము నడుపు శ్వాసల సంఖ్య = 1000 (ఒక వేయి)

ఆజ్ఞలు = ధర్మములు.

ఆగామికర్మ = పుట్టినప్పటినుండి చనిపోవువరకూ క్రొత్తగా వచ్చు పాపపుణ్యములు.

ఆత్మకు చిహ్నాములు = నఖలు, శిఖలు. (గోర్లు, వెంట్రుకలు)

ఆచరణ = చేయబడు కార్యము, కాళ్ళతోకాక చేతులతో చేయునది.

ఆచారము = చేయబడు విధానము, చేతులతో కాకుండ బుద్ధితో చేయునది.

ఆచారి = ఏ కార్యము ఎలా చేయాలో తెలిసినటువంటి వాడు, బుద్ధిగలవాడు.

ఆలోచితము = ఆత్మ, దీర్ఘముగా చూడదగినది.

ఆదికర్త = సృష్ఠి మొదలుకు కర్తగాయున్నవాడు (పరమాత్మ), ఆదరణకర్త.

ఆదిగురువు = సూర్యుడు వాణి ద్వారా మొదట తెలుసుకున్న జ్ఞానమును విశ్వవ్యాప్తముగా, భూమిమీద మనువుకూ ఆకాశములో గ్రహములకూ తెలియజేయడము వలన సూర్యుడు 'ఆదిగురువ'ని పేరుగాంచాడు.

ఆయత్ = వాక్యము (ఖుర్ఆన్‌లోని వాక్యము)

ఆర్యుడు = 'ఆచార్యుడు' అను పదమునుండి పుట్టినది.

ఆర్యులు = ఆసీయులు త్రేతాయుగములో మధ్య ఆసియా నుండి కరువు కాటకముల వలన భారత దేశము నకు వలస వచ్చిన వలసవాదులు. వేదములు, యజ్ఞములు ఎవరు ఖండించితే వారినందరినీ పరమతమువారని పేరుపెట్టి ముద్ర వేసెడివారు.

ఆసీయులు = ఆసియా ఖండములో నివసించెడివారు.

ఆచార్యులు = గురువులు.

ఆంజనేయునికి, దృఢకాయము మరియు సంపూర్ణ జ్ఞానియగుట యొక్క రహస్యము = పన్నెండు సంవత్సరములు గుడ్డలు లేకుండ వెన్నెలలో పడుకొనుట.

ఆంజనేయుడు = వాలి, సుగ్రీవులు అను కొండరాజులవద్ద దళపతి, సేనాధిపతి, గిరిజన దళనాయకుడు, ఏడు అడుగుల ఎత్తు కలిగిన ఆజానుబాహుడు, జ్ఞాని.



# ఇ

| | | |
|---|---|---|
| ఇందిరా దేశము | = | జ్ఞానుల దేశము. |
| ఇందువు | = | చంద్రుడు, జ్ఞానమునకు అధిపతి (జ్ఞానము తెలిసి దేవున్ని విశ్వసించు ప్రతి ఒక్కడూ 'ఇందు'వేనని తెలియాలి.) |
| ఇచ్ఛ | = | ఇష్టము. |
| ఇంద్ | = | ఆత్మ, ఆత్మశక్తి. |
| ఇచ్ఛామరణుడు | = | రావణబ్రహ్మ. రావణబ్రహ్మ యోగీశ్వరుడైనందున ఆయన ప్రాణమును ఆయన ఇష్టమొచ్చినప్పుడే వదలగలడు. ఆయన అనుమతి లేనిది మరణమురాదు. ఆయన ఇచ్ఛప్రకారమే మరణము రాగలదు. కనుక ఆయనను ఇచ్ఛామరణుడు అనవచ్చును. |
| ఇందూసమాజము | = | ఇందూ మతము (కలియుగమునకు ముందు అన్ని యుగములలో ఇందూమతము ఇందూసమాజమను పేరుతో ఉండెడిది.) |
| ఇందూ ధర్మములు | = | ఆత్మగల ప్రతి మనిషికీ సంబంధించిన ధర్మములు (మతమునకు సంబంధించినవి కావు.) |
| ఇందువు | = | దైవ జ్ఞానమును పొందినవాడు (చంద్రుడు) జ్ఞానమునకు గుర్తుగాయున్నవాడు. |
| ఇల్లు | = | శరీరము. |
| ఇల | = | ప్రపంచము. |
| ఇందూ | = | దేవుని జ్ఞానమునకు గుర్తింపు. |
| ఇందూ సంస్కృతి | = | దైవజ్ఞానముతో చేయబడిన మంచి కార్యము. |

ఇంద్రజాల మహేంద్రజాల = మంత్రములచే చేయబడు విద్యలు (ప్రాపంచికము)

ఇష్టము = శ్రద్ధ

ఇష్యము = వివిధ రకముల వస్తువుల వివరమును తెలుసుకోవడము.

ఇక్ష్వాకుడు = సూర్యవంశ రాజు (మనువు ద్వారా సృష్ట్యాదిలో జ్ఞానము తెలుసుకొన్న రాజు)

ఇంజీలు = బైబిలు (ఖురాన్ గ్రంథములోని పదము) మత్తయి సువార్త 5వ అధ్యాయము, 17వ వచనము బైబిలులోని వాక్యము భగవద్గీతకు ధృవీకరణ అని తెలుపుట. చంద్రకిరణములు (స్థూల అర్థము). దేవుని జ్ఞాన వాక్యములతో కూడుకొన్న గ్రంథము (సూక్ష్మఅర్థము) జిబ్రయేల్ గ్రహము చెప్పడమైనది.

## ఈ

ఈశ్వరుడు = అధిపతి, పరమాత్మ (పెద్దవాడు, గొప్పవాడు)

ఈడు = వయస్సు.

## ఉ, ఊ

ఉదాత్తము = ఉచ్ఛము, పైనుండునది, పవిత్రమైనది.

ఉత్తమ యోగి = సర్వ యోగులలో పరమాత్మ సాకారమును తెలిసి యోగము చేయువాడు.

ఉపదేశము = జ్ఞానాగ్నిని దానముగ పొందడము, దేశము కాని దేశము (జ్ఞాననేత్రము కలిగిన ప్రతి ఒక్కరూ చూడవలెను.) జ్ఞానశక్తి, పరమాత్మ.

ఉపనయనము = ఆత్మదృష్ఠి, ఆత్మను అధ్యయనము చేయు దృష్ఠి (ఇంద్రియములకు సంబంధములేని విషయములను చూపగల్గునది.) మూడవ కన్ను.

ఉచ్ఛాటన = జపించడము.

ఉగ్రవాది = తన భావమునకు వేరుగా ఉన్నవారిని హింసతో అణచివేసి, మూర్ఖముగా వారిని అంతమొందించువాడు.

ఊరేగింపు = ఊరు ఎరిగింపు; దేవుని జ్ఞానమును ధర్మములను ఊరిలోనివారికి తెలుపడము. గుర్తు ఎరుగునట్లు చేయడము.

ఉద్భీజములు = (వృక్షములు) విత్తనమునుండి పుట్టునవి.

ఉపనిషత్ = (ఉప+ని+షత్) సమీపములో ఉన్నదానిని చక్కగా పొందబడునట్లు చేయునది.

ఉప = సమీపము, ప్రక్కన, ని=చక్కగ, బాగుగ, షత్=చేర్చునది, పొందించునది, వేరొకటి, ప్రక్కది.

ఉపవాసము = ఆత్మహింస (ఆత్మహింస వలన పాపము వచ్చుట నిజము.) బాధతో కూడుకొన్నది.

ఉలిక్కిపడడము = జ్ఞానసందేశము. తన శరీరములో గొప్ప ఆత్మగలదని గుర్తించిన జ్ఞాని తెలుసుకోగలడు. (భయము కాదు.)

ఊహ = కొత్తగా పుట్టి వచ్చిపోవునది, హృదయమునుండి పుట్టునది, ఒక్కమారు వచ్చునది (ఊహ ఆత్మది).

ఊరు = ఊరునది, ఊటకల్గినది. (ఏడు ఊటలున్న ఊరు శరీరము.)

ఉపవాయువులు = నాగ, కూర్మ, కృకుర, దేవదత్త, ధనంజయ.

## ఎ, ఏ

ఎరుకల = తమలోని ఆత్మను తెలిసినవారు, ఎరుకగలవారు.

ఎడమ హస్తము = ఆత్మ,

ఏసు (హెబ్రీభాష) = రక్షకుడు.

ఏకము = ఒకటి (1=బేసి సంఖ్య), సృష్ఠికి గుర్తు.

ఏకాగ్రత = ఒకటి పైన శూన్యము.

ఏకాంతము = ఒక దానిని అంతము చేయుట, ఏ విషయ జ్ఞాపకము లేకుండుట.

## ఐ

ఐదోతనము = సౌభాగ్యము అనగా భర్తను కల్గి ఉండడము (ప్రపంచ భర్త కాదు.), మోక్షము.

ఐదు వాయువులు = వ్యాన, సమాన, ఉదాన, ప్రాణ, అపాన వాయువులు.

ఐరన్ మెల్ట్‌పేస్ట్ = ఇనుమును కరిగించునది. (ప్రాపంచికము)



## ఒ, ఓ

ఓం = పరమాత్మ బీజాక్షరము, ప్రణవము.
(సోహం+హంస) ఈ శబ్ధము మహిమగలది.
ఉఛ్వాస, నిశ్వాసల ద్వారా ఏర్పడు మంత్రము.
ప్రపంచ పుట్టుకలో మొదట పుట్టిన శబ్ధము. కావున
దీనిని ఆది మంత్రము అనుట సంభవించినది.
దైవము యొక్క గుర్తు, భాషాగుర్తు.

ఓం నమఃశివాయ = పరమాత్మ గొప్పతనము, నాశనము లేని తనమును
చూపించు గుర్తు (మంత్రము కాదు.)

ఓటు = సమ్మతము.

## క, ఖ

కర్మ = ప్రారబ్ధకర్మ చేత పనులు జరుగుచు క్రొత్తకర్మ
రావడము (అజ్ఞానులకు)

కర్మ = పాపములు+పుణ్యములు, విధి (కల్పించుకొనునట్టి
బాధ్యత, పని), జ్ఞానేంద్రియముల ద్వారానే
పుట్టుచున్నది.

కర్మేంద్రియములు = కాళ్ళు, చేతులు, నోరు, గుదము, గుహ్యము.

కర్పూరహారతి వెలిగించుట = రంగు, రూపు, గుణములు కల్గిన జీవున్ని,
దేవునియందైక్యము చేసుకొనుటకు అగ్నిని
అంటించుట.

కనుమలు = కొండలు.

కర్త = చేయించువాడు.

కర్మయజ్ఞము = (జ్ఞానయజ్ఞము) కర్మేంద్రియములు, జ్ఞానేంద్రియముల సముదాయము. దీనిలో బయటి విషయ జ్ఞాన సమూలము కాలుతున్నది. (అహము) ఆత్మ సంబంధిత జ్ఞానము కాదని తెలియాలి.

కర్మయోగము = జీవుడు తన శరీరములోని అహంకారమును గుర్తించినవాడై, అది చెప్పుచున్న విషయము తనకు సంబంధము లేదని, దానిమాట ఎప్పుడు వినడో అప్పుడు వానికి కర్మ అంటదు. జ్ఞానార్జన వలన అహంకారము మాట విననివాడు ముందు కర్మ అనుభవించుచూ కాలము గడిపి, ముందు కర్మ అయిపోయిన వెంటనే మోక్షము పొందును, మన శరీరములోని 25 భాగములలో 'అహము' అను భాగముతో కలియకుండా కర్మలు ఆచరించినచో క్రొత్త కర్మలు రావు. దీనినే కర్మ యోగమందురు, అహము మీద తిరగబడడము, అంతరంగ పోరాటము.

కర్మయోగి = కర్మయోగ మార్గములో ప్రయాణించువారు. (తన శరీరములోని అహమును అదుపులో పెట్టుకోవలసి ఉండును.)

కలి = నాశనమును కల్గించు యుద్ధము.

| | | |
|---|---|---|
| కృతయుగము | = | చేయబడినది. (కృత్‌యుగము) చేసినవాడు. విశ్వమును సృష్ఠించిన దేవున్ని ఉద్దేశించి పెట్టిన పేరు. |
| కర్మజం | = | ప్రారబ్ధకర్మ, సంచిత కర్మవలన పుట్టునది. |
| కృష్ణ | = | తెలియబడనది, తెలియనితనము, నలుపు. |
| కృతి | = | చేయబడినది, వ్రాయబడినది. |
| కషాయము | = | చెట్టు సారము కలిగినది. |
| కరణము | = | చేయుచున్నవాడు, చేయుచున్నది. (పని జరుగుటకు కారణమైన మనిషి, జ్యోతిష్యములో) |
| కల్పము | = | వేయి యుగముల పగలు కాలము. |
| కాలోస్మిలోకక్షయ | = | లోకమును నాశనము చేయు కాలమును. |
| కామము | = | ఆశ. |
| కార్యములు | = | పనులు. |
| కాయము | = | మానవ శరీరము. |
| కారణ శరీరము | = | శరీరము కల్గుటకు కారణమైన కర్మ. |
| కామార్థ ధర్మమోక్షము | = | కామము వలన ధనము, ధర్మము వలన మోక్షము వచ్చును. |
| కారణ జన్మలు | = | (చిరంజీవులు) వీరి జీవితకాలము కొద్దిదైనా ధ్యేయము గొప్పగా ఉండును. వీరు అందరిలా కాక జీవితములో ప్రత్యేకమైనది సాధించియుందురు. |
| కాలము | = | దేవుడు, కాల సూత్రములు, శాసనములు (బైబిల్) |

కాలకింకరులు = దేవుని సైనికులు, దేవుని సేవకులు.

కుమారుడు = భగవంతుడు, గర్భమునుండి పుట్టినవాడు.

కుటుంబము = సమస్యలమయమైన భార్య, పిల్లలతో గడుపు జీవితము.

కుంటు = సరిగా నడవనిది.

కుండలినీ శక్తి = ఏడు నాడీకేంద్రముల చైతన్యము (చైతన్యశక్తి)

కుడి హస్తము = జీవాత్మ.

క్రాంతి = తిరుగుబాటు, పోరాటము.

క్రియ = చేయువాడు.

కింకరుడు = సైనికుడు.

కొడుకు = కూడువాడు.

కోడలు = కూడబడునది (గుణములు) గుణములు జీవున్ని తనలో కలుపుకొనుట.

కర్మచక్రము = 108 భాగముల సముదాయము. కర్మచక్రములోని 12 భాగములలో ఒక్కొక్క భాగమునందు ఒక్కొక్క కర్మ నిలువ ఉంటున్నది. ఒక్కొక్క భాగములోని ఒక్కొక్క కర్మ తొమ్మిది భాగములుగా విభజింపబడి ఉన్నది. 12 భాగములందు 108 కర్మలుగా చీలిపోయినది ($12 \times 9 = 108$).

క్లోరోఫామ్ = మత్తుమందు (ప్రాపంచికము)

క్రోధము = కోపము

ఖేదము = సంతోషము కలుగజేయునది.

ఖుర్‌ఆన్ = అంతిమ దైవగ్రంథము (మూడవది)

కృష్ణుడు = నల్లనివాడు, ఏదీ కనిపించనిది, ఏదీ తెలియనిది, అవ్యక్తుడు.

## గ, ఘ

గతి = చలనము, చావు, పోవుట, చావునది.

గ = గతులు.

గుణము = గుణించబడునది, హెచ్చించబడునది.

గమ్యము = మోక్షము

గీత = హద్దు.

గుత్తా = పరమాత్మ, ఆత్మ, జీవాత్మల సారాంశమును తెలుపు పదము, శ్రీశ్రీశ్రీ ఆచార్య ప్రబోధానంద స్వామి వారి పుట్టుక కొరకే భూమి మీద తయారు చేయబడిన వంశము పేరు.

గర్భము = ఉంచునది. మర్మముగ ఉంచునది, రహస్యముగా దాచినది.

గురువు = దేవుడు. అసలైన ధర్మములతో కూడుకొన్న జ్ఞానము మానవులకు ఆయన ద్వారా తెలియును. ఒక ప్రాంతములో, ఒక కాలములో ఒక వ్యక్తిగానే గురువుంటాడు. ఇది సూత్రము. బ్రహ్మవిద్య, పరమాత్మ జ్ఞానమును బోధించువాడు. (మనిషికి గురువుగా ఉండుటకు ఏమాత్రము అవకాశము

లేదు. దేవుని అంశతో మనిషిగా వచ్చినవాడే గురువు, దేవుడు.)

గు (గుకారస్యగుణాతీత) = బ్రహ్మవిద్యా శాస్త్రము తెలిపినవాడు, గుణాతీతుడు.

గు = పరమాత్మను (అక్షరములకు అర్థములు)

గురువున్న విద్య = చూపుగల విద్య.

గుప్తుడు = జ్ఞానము తెలిసినవాడు.

గ్రుడ్డివిద్య = గురువు చెప్పబడనిది.

గురువు లేని విద్య = అజ్ఞానము (ప్రపంచ విద్యకు వర్తించదు.)

గురుపౌర్ణమి = పున్నమి చంద్రుని దినమైన పౌర్ణమిని గురుపౌర్ణమిగా తలచి, భగవంతుడైన గురువును ఆరాధించడమే గురుపౌర్ణమి యొక్క అంతరార్థము, మానవులు దైవమైన గురువును గుర్తు చేసుకొనునట్లు సంవత్సరముకొక పౌర్ణమిని "గురుపౌర్ణమి'గ పెద్దలు నిర్ణయించారు.

గురుతు = గురువు

గుర్తు = గురు.

గ్రహము = మనిషి శరీరములోని సూక్ష్మశరీరము. గ్రహించునది.

గ్రహములు = మనుష్యుల పాపపుణ్యములు గ్రహించుకొనునవి.

గ్రహ = దయ్యము, పిశాచి.

గుండుగీయించుకొనుట =మాయను జయించినందుకు గుర్తు.

| | | |
|---|---|---|
| గ్రుడ్డి | = | కనిపించక చీకటిగా ఉండుట. |
| గ్రుడ్డి నమ్మకము | = | మూఢనమ్మకము, గ్రుడ్డి భక్తి. |
| గిట్టువరకు | = | మరణించువరకు. |
| గిరిజనులు | = | కొండ మనుష్యులు. |
| గిరి | = | కొండ. |
| గుడాకేశుడు | = | నిద్రను జయించినవాడు. (అర్జునుడు) |
| గ్లాని | = | బలహీనపడడము, కాలుష్యము. |
| గురుగ్రహము | = | ప్రపంచ జ్ఞానమునకు అధిపతి. |
| గుప్త | = | దైవజ్ఞానము ఒక్కటే కలవారు. |
| గుప్తము | = | రహస్యము. |
| గత్ | = | గడచిపోయినది; మరణించడము. |
| గోవింద | = | అంత్య స్థితిని తెలియజేయు పదము, అయిపోయినది. (దేవుని పేరుకాదు.) |
| గుణచక్రము | = | 108 గుణ భాగముల సముదాయము. గుణ చక్రములోని 12 గుణములు ఒక్కొక్కటి తొమ్మిది భాగములుగా విభజింప బడి మొత్తము 108 గుణ భాగములుగ విభజింపబడినది. |
| గ్రంథము | = | శరీరములోనున్న కన్నీటి గ్రంథిని ఉత్తేజపరచునది. గ్రంథమును చదివినప్పుడు కంటినుండి ఆనంద భాష్పములు వచ్చు విధము. |
| గాంధారదేశము | = | ఆఫ్ఘనిస్తాన్. (దృతరాష్ట్రుని భార్య గాంధారి పుట్టిన దేశము.) |

గౌతమబుద్ధుడు జన్మించిన ప్రదేశము = భారతదేశములో కాశీకి ఉత్తరమున, అయోధ్యకు ఈశ్యానమున 'భయిలా' అను బీహారు రాష్ట్ర ప్రాంతములోని గ్రామమునందు జన్మించాడు.

గౌతమబుద్ధుని తల్లితండ్రి పేరు = మాయాదేవి, శుద్ధోదనుడు.

గౌతమబుద్ధుని జ్ఞానోదయానంతరం పెట్టిన పేరు = సిద్ధార్థుడు.

గౌతమబుద్ధుని భార్య పేరు = యశోధరాదేవి.

ఘటము = కుండ, శరీరము.

ఘంటు = మూట.

## చ, ఛ

చర = మార్పు చెందేది. (జీవమున్న ప్రకృతి)

చక్రము = కర్మనాశనమునకు గుర్తు.

చహ్ = తేలు.

చిత్తు = జీవాత్మ.

చాతుర్వర్ణములు = నాలుగు రకముల వర్ణములు అవి
1) సాత్త్వికులు 2) రాజసులు 3) తామసులు
4) యోగులు (బ్రాహ్మణ, వైశ్య, క్షత్రియ, శూద్ర కులములు కావు.)

చైతన్యశక్తి = ఆత్మశక్తి, సత్తు, కదలికశక్తి

చందము = దైవజ్ఞానము, సూక్ష్మశరీరమునకు సంబంధించినది.

చంద్రుడు = దైవజ్ఞానమునకు అధిపతి (చిహ్నము.), ఆత్మజ్ఞానమునకు చంద్రుడు అధిపతి (జ్యోతిష్యశాస్త్రము ప్రకారము).

చతుర్ = నాలుగు.

చవితి = నాల్గవది, జ్ఞానము తెలిసినవాడు, యోగి, నాలుగు.

చంద్రగ్రహము = దైవజ్ఞానమునకు అధిపతి.

చిత్తగించడము = నిర్ణయము చేయడము, ఒప్పుకోవడము.

చిదంబర రహస్యము = వస్త్రము (శరీరము) వదిలినప్పుడే పరమాత్మలో ఐక్యమగుట, కర్మలు లేకుండ చేసుకొను స్థితి.

చిద = వస్త్రము, చేలము.

చేలము = అజ్ఞానము (జన్మగల స్థితి)

చిదంబరము = వస్త్రఆకాశము, బట్టబయలు.

చేతన ప్రకృతి = సర్వ జీవరాసుల మొత్తము శరీర భాగములు 25, చర జగతి.

చెడు గుణములు = కామ, క్రోధ, లోభ, మోహ, మద, మత్సరములు (ఆరు)

చిత్తము = కర్మానుసారిణి.

చిత్రగుప్తుడు = ఆత్మ. ప్రతి జీవరాశిలో ఎవరికీ తెలియకుండ ఉండుటవలన ప్రపంచములో అన్నిటికంటే రహస్యమైనది ఆత్మ కావున ఆత్మ అత్యంత గుప్తమైనది.

## జ, ఝ

జ = పుట్టుట.

జం = పుట్టుట.

జగద్గుర్తు = జగద్గురువు.

జగద్భర్త = పరమాత్మ (జగత్తు అంతటికీ భర్త)

జగత్ పితా = సృష్టికర్త, లోకమునకు తండ్రి.

జగత్‌మాతా = ప్రకృతి, లోకమునకు తల్లి.

జనని = పుట్టించునది.

జననము = కొత్త శరీరమును ధరించడము, జన్మ, పుట్టుక.

జనకా = పుట్టునట్లు చేయువాడు.

జగతి = జనించుట, గతించుట, ఐదు స్వల్ప భూతముల సముదాయము.

జనులు = మనుషులు

జాడ్యము = శరీరములోనే ఉత్పన్నమగు బాధను 'జాడ్యము' అంటారు. ఉదా :- మోకాళ్ళ, కీళ్ళనొప్పులు, ఉబ్బసము, మధుమేహము, చత్వారము (చూపుతగ్గుట) ముసలితనము, శరీరము సహజత్వమును కోల్పోవడము మొ॥నవి.

జబ్బు = శరీరము బయటినుండి వచ్చును. కావున శరీరము వదలి బయటికే పోవును.

జనమే జయుడు = పరీక్షిత్తు కుమారుడు.

జాంబవంతుడు = వాలి, సుగ్రీవులకు మంత్రిగా, పెద్దగా ఉండినవాడు.

జాపథకము = (జాతకము) పుట్టునప్పుడు నిర్ణయించబడునది.

జీవుడు = (జీవాత్మ) శరీరములో అస్వతంత్రుడు. కర్మబద్ధుడై కర్మను అనుభవించువాడు, అనామకుడు.

జీవజలము = దేవుని జ్ఞానము.

జీవరాశులు = మార్పు చెందేటువంటి ప్రకృతి (జీవమున్నటువంటి)

జీవునికి ఒక దినము శ్వాసలు ఆడు సంఖ్య = 21, 600 (ఇరవై ఒకవేయి ఆరువందలు)

జితాత్మనః = ఆత్మను అనుభవించు సమయము.

జకాత్ = తనకు కలిగిన ధనమును కొంత దేవునికి ఉప యోగించడము.

జిహాద్ = మతమును రక్షించుకోవడము, దేవుని జ్ఞానము కొరకు పోరాడడము.

జీవికి మొదటి దినము = ఆదిలో పుట్టుక దినము.

జీవికి చివరి దినము = ఎప్పటికైనా జ్ఞానము ద్వారా కర్మశేషము లేకుండా చేసికొని, తిరిగి పరమాత్మలోనికి ఐక్యమగురోజు అనగా ముక్తి పొందిన దినము చివరి దినము.

జిజ్ఞాసి = దైవమును గురించి తెలుసుకోవలెనని ప్రయత్నము చేయువాడు.

జాగ్ = మేలుకోవడము; జన్మించడము.

జాగ్రత్త = గడచిపోయిన పుట్టుకను గురించి తలచుకొని, రాబోవు చావును గురించి మెలకువ కల్గియుండడం.

జోడు ఆత్మలు = జీవాత్మ, ఆత్మ.

జోడు = ఎత్తు.

జననము = పుట్టుక.

జీవితము = పుట్టుకతో మొదలవునది, కర్మసాహిత్యము, శరీరమును నడుపు ఆత్మ శరీరములోనే ఉండి, శరీరమును నడిపించడము, నరకాగ్ని, సుఖ, దుఃఖములమయము.

జగతి = పుట్టుక, చావులు గలది. ప్రపంచములో 'జగతి' అను జీవ సముదాయము.

జీవము = శాశ్వతముగా ఉండు, శాశ్వతముగ జీవించుట, నాశన రహితమైన మోక్షము.

జయంతి = పుట్టుకలో 24 భాగములలో కూడుకొన్న శరీరము నీకు తగులుకొనుచున్నది. అదియే జయంతి.

జ్యోతి = వెలుగుచున్న దీపము (జ్ఞానము)

జ్యోతిష్యము = ఆత్మజ్ఞానముగల మనిషి తన జ్ఞానముతో ఎదుటి మనిషి శరీరములోని కర్మను తెలుసుకొని వానికి తెలుపడము. భవిష్యత్ కాలమును తెలియుటకు జ్ఞాననేత్రము కావలయును. జ్ఞానజ్యోతి వలన తెలియునది.

జ్యోతిష్యశాస్త్రము = శాస్త్రములలో ఐదవది, ఒక మనిషి కర్మలోని పాప పుణ్యములను దైవజ్ఞానముతో తెలుసుకొని, పాపపుణ్య ఫలితములను శాస్త్రబద్ధముగా వివరించి చెప్పు శాస్త్రము, జరుగబోవు కార్యములను తెలుపునది.

జ్ఞేయము = తెలియబడునది.



# జ్ఞా

| | | |
|---|---|---|
| జ్ఞానము | = | వివరము (దేవుని యొక్క వివరము తెలిసికొనుట) |
| జ్ఞానమార్గము | = | దేవున్ని చేరుకొనే మార్గము. |
| జ్ఞానేంద్రియములు | = | కన్ను, ముక్కు, చెవి, నాలుక, చర్మము. (ప్రపంచ జ్ఞానమును తెలుపునవి.) |
| జ్ఞానయజ్ఞము | = | (కర్మయజ్ఞము, సూక్ష్మములు) కొత్తగా జరుగుచున్న కార్యములలో వచ్చు ఆగామికర్మను కాల్చివేయడము. జ్ఞానేంద్రియములలోని ప్రపంచ జ్ఞానార్థములను కాల్చివేయడము, జ్ఞానయజ్ఞములో అగ్నిగా ఉపయోగపడునది, ఆత్మజ్ఞానమనబడు అగ్ని, శిరస్సులో సూక్ష్మములైన ఆత్మానాత్మల సూక్ష్మ విషయములు తెలియుట వలన ఏర్పడిన సూక్ష్మ అగ్ని, జ్ఞానేంద్రియములలో సూక్ష్మముగా ఉన్న జ్ఞానార్థములను కాల్చివేయడము. |
| జ్ఞాన కర్మయజ్ఞము | = | కర్మేంద్రియములు, జ్ఞానేంద్రియముల సముదాయము. |
| జ్ఞాన పదము | = | దైవజ్ఞానములోని మార్గము (జ్ఞానమార్గము) |
| జ్ఞానశక్తి | = | సాధన చేసి యోగమాచరించగా వచ్చు కనిపించని శక్తి. |
| జ్ఞాననేత్రము | = | దేవుని విషయమును చూపునది. |
| జ్ఞాని | = | జిజ్ఞాసుడై వుండి జ్ఞానము తెలుసుకొనువాడు. |



## ట, ఠ

టక్కుటమార = హస్తలాఘవము చేత చేయబడు విద్యలు (ప్రాపంచికము)

## డ, ఢ

డయాబెటిస్ = (షుగరు) శరీరములో క్లోమరసగ్రంథి (ప్రాంక్రియాస్ గ్లాండ్) తన సామర్థ్యమును కోల్పోతే వచ్చు జాఢ్యము (రుగ్మత).

డ = జీవాత్మకు గుర్తు. (జీవాత్మ ఏ ఆత్మతోనూ సంబంధము లేనందున ఒకే అక్షరమైన 'డ'ను జీవుని గుర్తుగా ఉంచడమైనది.)

## త, థ

తల్లి = కార్యమైనది.

తరుణీ = గర్భిణీ స్త్రీ.

తండ్రి = కారణమైనవాడు.

తల్లి, తండ్రి = భౌతికముగా కనిపించెడి వారు, ప్రాపంచికమునకు సంబంధించినవారు (నకిలీ), జన్మ జన్మకూ మారుచుందురు (అశాశ్వతమైన) భౌతికమైనవారు. సూక్ష్మ పరంగా కనిపించనివారు, బ్రహ్మవిద్యా శాస్త్రనుగుణంగా పారమార్థికత కలవారు, నిజమైన తల్లి, తండ్రి ప్రకృతి,పరమాత్మ.

తలంబరము = జ్ఞానము (అకాశమునుండి తలకు చేరునది)

తద్విద్ధి = తత్వమును తెలిసినవారు, తనను తాను తెలిసినవాడు.

తపన = చిన్న కోరిక, తలచుకోవడము.

తపస్సు = పెద్ద కోరిక, మరిమరి తలచుకోవడము.

తీవ్రవాది = తన భావమునకు వేరుగా ఉన్నవారందరినీ హింసతో అణచివేయాలని హింసించువాడు.

త్యాగము = కార్యము జరిగిన తర్వాత అందులో వచ్చు కర్మను వదులుకోవడము త్యాగము.

తామస జ్ఞానము = శాస్త్రబద్ధము కానట్టిది, అసత్యమైనది, అల్పమైనదియునైన ఒక్కకార్యమే సర్వార్థ సిద్ధియనుచు, ఆసక్తియంతయు దానియందుంచు జ్ఞానము.

తామస కర్మ = తాను చేయు పని వలన కలుగు నాశనమును, హింసను ఆలోచించక, తన చేతనౌనో కాదోయని యోచించక, పౌరుషములచే అజ్ఞాన భ్రాంతితో చేయు కర్మములు.

తామస కర్త = అస్థిర స్వభావుడు, అనర్హుడును, శాస్త్రవిధానము తెలియని అవిద్యాపరుడును, ఏదీ ఆరంభించక ఉండువాడు, మోసగాడును, ఇతరులను చెరచువాడు, సోమరితనమునుగలవాడును, విషాదపరుడు, తొందరగా చేయవలసిన దానిని దీర్ఘకాలము వరకు చేయనివాడు తామస కర్త.

తామస బుద్ధి = అజ్ఞానము చేత అధర్మమును ధర్మమనిపించుచు,

మరియు తెలియదగిన వాటినన్నిటికి విరుద్ధముగా తెలుపుచున్న బుద్ధి.

తామస ధైర్యము = స్వప్నము, భయము, శోకము, విషాద, మదములు మొదలుగా గల విషయములందు మదిని విడువకుండా నిల్పు దుష్టునికున్న ధైర్యము.

తామస సుఖము = ఆదియందు అంత్యమందు కూడా నిద్ర, ఆలస్య, ప్రమాదములతో కూడి మనస్సును అజ్ఞానమందు ముంచు సుఖము.

త్రైతారాధన = మూడు రకముల ఆరాధనలు, మూడు యోగములకు నమూనాగా, మూడు దినములందు, మూడు కాలములలో ఆచరించు ఆరాధనలు, పరమాత్మవశమైన సుఖమును అందించు ఆరాధనలు, ఆది మధ్య అంత్య ఆరాధనలు.

తాంత్రికులు = ఆత్మశక్తి గలవారు.

తిరునామ = (తిరునాల) మూడు నామములు.

తీర్పు = తీర్చబడునది.

త్రిగుణాతీతుడు = జ్ఞానములో మూడు గుణములను అతిక్రమించిన వాడు. మూడు గుణములను జయించినవాడు. మూడు గుణములు అంటనివాడు (తామస, రాజస, సాత్త్వికములు).

తదియ = మూడవది (తిథి).

తత్త్వము = శరీరములోని రెండవ ఆత్మ.

తిరస్కారులు = దేవున్ని, దేవుని విషయములను ఒప్పుకోనివారు.

తండ్రి = దేవుడు.

తూర్పుకనుమలు = నల్లమల అడవులు.

తిప్పలు = కష్టములు.

త్రేతాయుగము = త్రైతాయోగము, దేవుడు మూడవ పురుషుడు, లేక మూడవ ఆత్మ కావున కాలమును త్రైతాయుగమని అన్నారు.

త్రేతాయుగము = (అర్థములేదు.)

త్రైత సిద్ధాంతము = పరమాత్మ, జీవాత్మకాక ఆత్మకూడ ఒకటి కలదని చెప్పినది ఒకే ఒక త్రైత సిద్ధాంతము. మూడు ఆత్మల వివరమును శాస్త్రబద్ధముగా తెలియ జేయునది.

త్రేతాయుగము (త్రైతాయుగము)లో క్షత్రియులలో చీలిపోయిన తెగలు = సూర్యవంశము వారు, చంద్రవంశము వారు.

తామస గుణము = తామస గుణ ఆవరణలో ఉన్న గుణములు అజ్ఞానమును కలుగజేయునవై, మోహమును పుట్టించునవై ఉన్నవని తెలియుము. అంతేకాక ప్రమాదములలో కూడుకొన్న, మజ్జుతనము, నిద్రలయందే జీవున్ని బంధించి పెట్టుచున్నవి.

తౌహీద్ = ఏకేశ్వరోపాసన (ఒకే దేవున్ని ఆరాధించడము).

తౌరాత్ = భగవద్గీత. (ఖురాన్ ధృవీకరించినది. ఖురాన్ మూడవ సురా, మూడవ ఆయత్, ఆరవ సురా 92వ ఆయత్) తౌ=మూడు, రాత్=రాత్రులు, మూడు రాత్రులు (జీవాత్మ, ఆత్మ, పరమాత్మ)

# ద, ధ

దశ = పది.

ధమ్ = నాశనము.

దశర = పది శరీర ఇంద్రియములను పనిచేయకుండ చేయుట.

దాత = ఇచ్చువాడు.

దాసరికము = మాయకు దాసుడుగా వుండడము.

దశలు = కొన్ని పదులు.

దశేంద్రియములు = పది శరీర భాగములు (ఐదు కర్మేంద్రియములు, ఐదు జ్ఞానేంద్రియములు.)

దయ్యము = గ్రహము, సూక్ష్మశరీరము.

దయ్యము = మనిషి అకాల మృత్యువు పొందితే, ఆయుష్షు అయిపోవువరకు ఉండు స్థితి.

దయ్యము = దేవుడు కానివాడు (జీవుడు)

దస్కత్ = పది విషయములతో కూడుకొన్నది. (దశేంద్రియముల సముదాయముతో కూడుకొన్నది.)

దైవజ్ఞానము = ఆత్మ విషయములు (ధర్మములు)

దేవతలు = మనుషులలో కొంత ఎక్కువ పుణ్యము చేసినవారు. (వీరు కూడా జీవులే)

ధర్మ = నిబంధన (బంధము లేనిది, బంధింపబడనిది.)

ధర్మము = దైవ సిద్ధాంతములను తెలుపునది, ఒక వస్తువు లేక పదార్థము. జీవమున్నదికానీ, జీవములేనిది

కానీ, దానికున్న సూక్ష్మ సహజత్వమును 'ధర్మము' అనవచ్చును, అన్నిటికీ కారణమైన కర్మను లేకుండ చేయునది. మూడు గుణ భాగములలోని 108 గుణములను నాశనము చేయు విధానము.

ధర్మసంస్థాపన = లేని ధర్మములను సృష్టించడము.

దాన ధర్మము = ధర్మమునే దానము చేయుట. దేవుని ధర్మములు నశించకుండా, దేవుని ధర్మములు అందరికీ తెలియునట్లు మనము చేయుటయే ఆయన పనిని మనము చేసినట్లు. ఏ అవకాశము లేనివారు ఈ విధముగానైనా నావద్దకు చేరవచ్చునన్నప్పుడు, జ్ఞానము తెలియనివాడు, యోగికానివాడు సహితము దానము చేయునప్పుడు ఆ దానము దేవుని పని అయిన, ధర్మప్రచారమునకే వినియోగించబడునట్లు చేయడము దైవ సాన్నిధ్యమునకు మార్గమగును. అందువలననే పెద్దలు, నీవు చేసే దానము ధర్మము కొరకు ఉండవలయునని ఆ మాట మరచిపోకుండునట్లు 'దాన ధర్మము' చేయండని చెప్పారు. (భగవద్గీత భక్తియోగము 10వ శ్లోకము).

దిగివచ్చు ఆహారము = జ్ఞానరూపముగ దేవునివద్ద నుండి వచ్చిన ధర్మములు.

దిగంబరులు = ఆకాశము నుండి దిగివచ్చినవారు, దైవ పరిపాలకులు.

ధర్మశాస్త్రము = నిన్ను, నన్ను సర్వమును లేకుండా చేయు శాసనములతో కూడుకొని ఉన్నది, దేవుని శాసనములతో కూడుకొనియున్నది. (దేవున్ని తెలియుటకు) దేవుని ధర్మములతో కూడుకొని యున్నది. శరీరములోనున్న దైవమును తెలుపునది.

దైవరహస్యము = దేవుడు ఎవరికీ తెలియకుండా, భగవంతునిగా భూమిమీదకు వచ్చిపోవడము.

దానము = ధన, కనక, వస్తు, వాహనరూపములలో ఉదారముగా ఇతరులకు ఇచ్చెడిది. (ప్రపంచ సంబంధము.)

ద్వాపర = మూడు ఆత్మలలో రెండు కానిది దేవుడు, రెండింటి కంటే వేరుగ ఉన్నది. (పూర్వము పెద్దలు నిర్ణయించిన పదము.)

దూషణ = తిట్టు

ద్రవ్యయజ్ఞము = ద్రవ్యములను కాల్చుట (స్థూలములు)

దేవుడు = వెదకబడేవాడు (దేవులాడబడేవాడు)

దీవెన = ఆశీర్వాదము.

దేవునికి గుర్తు = రాత్రి

దేవదాసీలు = శృంగారము తెలియనటువంటివారు (స్త్రీలు) దేవుడు, దేవతలకు అర్పించెడివారు.

దూషణులు = దేవుడున్నాడని తెలిసికూడ, దేవునికి విలువివ్వక, దూషించువారు, అవమానించువారు.

ద్రోహి = దేహికి (ఆత్మకు) ఇబ్బంది కలుగజేసినవాడు.

ద్వేషము = అసూయ.

దైవజ్ఞానులు = చంద్రవంశమునకు చెందిన ఇందుమతులు.

ద్వైతులు = పరమాత్మ, జీవాత్మ అను ఇరువురినీ చెప్పినవారు.

ద్రా = పరమాత్మకు గుర్తు (దా+ర=ద్రా సంయుక్త అక్షరము)

ద్వాపర = రెండిటికంటే వేరుగా ఉన్నది, రెండుకానిది, మూడవది.

ద్వాపర యోగము = జీవాత్మ, ఆత్మ అను రెండు ఆత్మలకంటే వేరుగా ఉన్న పరమాత్మలోనికి ఐక్యము కావడము.

ద్రావిడులు = మూడు ఆత్మల జ్ఞానము తెలిసినవారు.

## న

నమస్కారము = కుడి, ఎడమల ఆత్మలను ఐక్యము చేయడము.

న = ఆకాశమునకు గుర్తు (బీజాక్షరము)

నలమలకనుమలు = నలమలకొండలు

నరకము = మనము అనుభవించు కష్టములు.

నపుంసత్వము = పురుషుని విషయము తనవద్ద లేకపోవడము, ఆత్మజ్ఞానం లేకపోవడము.

నరకలోకము = కనిపించెడు బాధలుగల స్థితి.

నక్షత్ర = ప్రకృతికి నాశనము కానిది (పరమాత్మ).

నక్షత్రము = గొడుగు క్రింద లేనిది (నాశనము లేనిది) కనిపించని ప్రదేశము, మోక్షమునకు గుర్తు.

నవ్యయాత్మ = మరణము కూడా లేనిది.

నమాజ్ = దేవుని ప్రార్థన, ఆరాధన (ఖుర్ఆన్)

నామములలో తెల్లనివి = ఇడ, పింగళ (సూర్య, చంద్ర) జీవాత్మ, ఆత్మ.

నామములలో ఎర్రనిది = బ్రహ్మనాడి. (ఆత్మ నివాసస్థలము) పరమాత్మ గుర్తు.

నాస్తికవాది = దేవుడు లేడు అని మూర్ఖముగా వాదించువాడు.

నామకార్థ యజ్ఞము = తమ్ము తాము పొగడుకొనుచు, తమ ప్రభావమే గొప్పదనుచు, ధనమాన మధములచే కూడినవారు గర్వముతో అశాస్త్రీయ పద్ధతిలో చేయు యజ్ఞము.

నాదపుత్రులు = పూజ్యగురువు యొక్క జ్ఞాన నాదముచే అభివృద్ధి అయినవారు.

నాగులు = పాములు.

నాగుల చవితి = పాముల నుండి రక్షణ పొందడము.

నాయీ = కుక్క.

నాలుక = భయము లేనిది (న+అలుక)

నాస్తికులు = దైవదూషణులు. శక్తి అను ధనములేనివారు.

నామమ్ = నేను కాదు (న=కాదు, మమ్=నేను)

నానారూపేణ = అనేక రోగములు (నానారూపేణ కాలకింకరః)

నాయీబ్రాహ్మణులు = కుక్క బ్రాహ్మణులు (ఈ పదము శ్రీకృష్ణ దేవరాయల కాలము నుండి వాడుకలో ఉన్నది.)

నావారను భావము = మోహ గుణము.

నిఘంటు = ఉత్తమూట.

నీటితత్త్వములు = రుచి (రసము), శబ్ధము, స్పర్శ, రూపము, వాసన.

నిజ = పుట్టనివాడు (ని=లేదు.) (జ=పుట్టుక)

నియమము = చిన్నది.

నియతకర్మ = ప్రారబ్ధకర్మ, నిర్ధేశింపబడిన కర్మ.

నిబంధన రక్తము = జ్ఞానశక్తి, జ్ఞానములోని సారాంశము.
ఏ కర్మబంధనము లేని దేవుని జ్ఞానము.

నిత్యజీవము = మోక్షము చావుపుట్టుకలు లేనిది.

## ప, ఫ

పథకము = ముందే నిర్ణయించుకోవడము.

పరమాత్మ = ఆత్మకు పరముగ (వేరుగా) ఉన్నది, తండ్రి
(ప్రపంచమునకు, సర్వజీవులకు తండ్రి)

పర = వేరుగ, నాకంటే వేరైనదని అర్థము.

పరంధామ = ఒకచోట నివాసము లేనటువంటివాడు.
(విశ్వవ్యాపి).

పరిజ్ఞాత = తెలుసుకొనువాడు.

పుంసత్వము = ఆత్మజ్ఞానం కల్గియుండడం.

ప్రదాత = అన్నిటికంటే ముఖ్యమైనది (దైవజ్ఞానము)
ఇచ్చువాడు.

పురము = పౌరులు నివసించునది, ముగ్గురు పురుషులు
నివసించునది, శరీరము.

పంచభూతములు = మార్పు చెందనటువంటివి. (ప్రకృతి) కర్మ లేనివి.

పంచాంగము = ఖగోళ శాస్త్రము ప్రకారము పుట్టినది, ఐదు

అంగములుగలది. (తిథి, వార, నక్షత్ర, యోగ, కరణములు అను ఐదు విషయ సమాచారము.)

పండుగ = మార్పువచ్చిన పండునుండి వచ్చిన పదము (గడచిన కాలములో పుట్టి, ఏమి సాధించావని తెల్పుటకే పెద్దలు 'పండుగ ఉంచారు. నీ జీవితము కొంత పరిపక్వతకు వచ్చి 'పండు' అయినదని తెలుపుటకే పండుగ.)

పగలు = జీవిత కాలము అమలుపడు కాలము, 12గం॥ కాలము; కామ, క్రోధ, మత్సరము అను గుణములచేత ప్రతి జీవితములోని శత్రుత్వము ఉన్నది. అజ్ఞాన సంబంధమైనది మాయ. శతృత్వమునే పగ అంటున్నాము.

పరము = దైవము.

పథము = మార్గము, దారి

పరధర్మము = ప్రకృతి ధర్మము.

పంచము = ఐదు (గాలి, నీరు, అగ్ని, భూమి, ఆకాశము.)

పరలోక తండ్రి = పరమాత్మ.

పరిశుద్ధాత్మ = పరమాత్మ.

పరిశయ్యులు = అజ్ఞానులు.

పరలోకము, పరలోక రాజ్యము = మోక్షము.

పాముకాటు = మృతి చెందిన జీవుడు 4 గం॥ నుండి 24 గంటల వరకు శరీరమునుండి బయటకు పోకుండా మృత శరీరములో ఉండును.

పారేట = (పారువేట) పరుగెత్తి వేటాడుట.

పాపము = దీనివలన కష్టములు సంభవించును, దుఃఖము కల్గును.

ప్రయోగము = జ్ఞానేంద్రియములకు తెలియని దానిని తెలుసు కొనుటకు కర్మేంద్రియముల సహాయముతో చేయు కార్యము. (ప్రకృతికి సంబంధించినది.)

ప్రాణాయామము పంచప్రాణములని పేరుగాంచిన వాయువులు ఒక్కటి కావడము. రెండు విధములు.
1. లోపలికి పీల్చిన శ్వాసను బయటికి వదలకుండా లోపలనే బిగించి ఉంచడమును 'కుంభకము' అని అందురు. కుంభకము ద్వారా శ్వాసను బిగించి లోపల ఉన్న వాయువులన్నిటినీ ఏకము చేయడము. ఒక విధ ప్రాణాయామము.
2. జీవుడు కుంభించిన శ్వాసను నిలుపకనే యోగము వలన శ్వాస తనంతట తాను నిలిచిపోయి లోలపవున్న వాయువులన్నియు ఏకము కావడము రెండవది.

ప్రజాపతి = సూర్యుడు.

ప్రవక్త = భగవంతుడు.

పద+అర్థము = పదార్థము. దేవుడు వ్యాపించినది.

ప్రాణము = గాలి.

ప్రారబ్ధకర్మ = ఈ జన్మలో పుట్టినప్పటినుండి చనిపోవువరకు జరుగునది; మనిషి పుట్టినప్పుడే నిర్ణయము జరుగునది.

పురషరత్న = కదిలెడు మూలిక. మూలికలలో ఒకటి.

పురుషార్థములు = రెండు మాత్రమే కలవు. 1) స్థూలార్థము నిచ్చునది.
2) సూక్ష్మార్థము నిచ్చునది.
1. కామ-అర్థ, ధర్మ-మోక్షము.
2. తల్లి-తండ్రి, గురువు-దైవము.

పురాణకాలక్షేపములు = కాలము వృథా అయిపోవు కథలు.

పుక్కిడిపురాణములు = అబద్ధపు పురాణములు.

పురుషోత్తమ = పరమాత్మ హెూదాను తెలుపు పదము (పేరుకాదు.)

పురోహితులు = దైవప్రాప్తికోసము హితమును బోధించువారు. కావున పురోహితులందురు. మానవ జీవిత ధ్యేయము మోక్షము సాధించుటయేనని తెల్పెడివారు. (పురములో జీవించెడి పౌరులకు)

పురుష = పరమాత్మ సంబంధమైనది (ఏ జీవునకైనా)

పున్నమి = సంపూర్ణ జ్ఞానమునకు చిహ్నాము.

పురుషోత్తముడు = పరమాత్మ. నరపురుషులకంటే ఉత్తమమైనవాడు. (పరమాత్మ హెూదా అని, పేరుకాదని గ్రహించ వలెను.), అక్షరునికంటే శ్రేష్ఠుడు.

పుణ్యము వచ్చు కర్మలు = షట్ (6) మంచి గుణములు.

పాణిమట్టము = లింగమునకు ఆధారమైనది. లింగము క్రింద ఉండునది.

ఫట్ = పగిలిపోవడము.

ప్రభవము = సృష్టి, పుట్టుక=మొదలు పెరగడము=నడుమ, నాశనము.

ప్రళయము = దైవము యొక్క ఒక దినము (పగలు వేయి యోగములు,రాత్రి వేయి యోగములు)

ప్రదేశము = ఉపదేశములాంటి ప్రత్యేకమైన దేశము (కనిపించనిది)

పుణ్యము = దీనివలన సుఖములు సంభవించును.

ప్ర = అన్నిటికంటే గొప్పది, ముఖ్యమైనది, పుట్టినది.

ప్రబోధ = విశిష్టమైన బోధ, సారాంశముగల బోధ.

పాడ్యమి = ప్రథమ తిథి (మొదటిది), మౌఢ్యము (అజ్ఞానము)

ప్రథమ = పాడ్యమి.

ప్రకృతి = ప్రపంచము (పంచభూతములు) అచర ప్రపంచము (నాశనము కానిదని చెప్పవచ్చును.), జగతి (చర ప్రపంచము) నాశనమగునది. పుట్టుక, చావుకలది. (జీవరాసులు) జీవరూపమైనది. తల్లి, సర్వ జీవులకు రూపమిచ్చునది. (ప్రపంచము) జీవరూపము నిచ్చునది. సర్వ జీవులకు రూపమిచ్చునది.

ప్రణవ = పరమాత్మ, మొదటిది, అన్నిటికంటే ముఖ్యమైనది, సమస్తమునకు పెద్దది.

ప్రపంచమునకు మొదటి దినము = ప్రభవము (ఆదివారము)

ప్రపంచమునకు చివరి దినము = ప్రళయము (శనివారము)

ప్రవక్త = బాగా చెప్పువాడు. (అసాధారణమైన దేవుని జ్ఞానమును బాగా మాట్లాడువాడు.)

పున్నమి చంద్రుడు = పూర్ణ జ్ఞానమునకు గుర్తు. జ్యోతిష్యశాస్త్రము ప్రకారము జ్ఞానమునకు చిహ్నము చంద్రుడు.

| | | |
|---|---|---|
| | | సంపూర్ణ జ్ఞానమునకు చిహ్నము, పున్నమిరోజు వచ్చిన గుండ్రని చంద్రుడు. |
| ప్రతిమ | = | స్థూల దేహము, విగ్రహము |
| ప్రపంచము+జగతి | = | విశ్వము. |
| ప్రపంచము | = | ఐదు మహాభూతముల సముదాయము. |
| ప్రభు | = | ముఖ్యమైన పుట్టుక, ప్రభావవంతమైనది. (ప్ర=ముఖ్యమైనది, భు=పుట్టుక) గొప్పది. సారాంశము గలది. |
| ప్రదాయము | = | కనిపించని పాపము, పుణ్యము. |
| పొరుగువాడు | = | నీకు ప్రక్కనే ఉన్న ఆత్మ. |
| పోతులయ్య | = | (బొడ్డురాయి) పురుషోత్తముడు. |
| పెళ్ళి | = | దైవము. |
| పొల్లు | = | సూత్రములు, శాసనము. |
| పిండము | = | శరీరము. |
| పీరు | = | రేకుతో తయారు చేయబడిన గుండ్రని ఆకారము, పైన మూడు కొమ్ములు (దైవ సమాచారమును తెలుపు గుర్తు.) |
| పితా | = | అందరినీ పోషించునట్లు చెప్పినవాడు. |
| ప్రకృతి, ఆత్మలు | = | అక్క, తమ్ముళ్ళు. |
| పేడు | = | కట్టె (కట్టబడునది) |
| పంచప్రాణములు | = | వ్యాన, సమాన, ఉదాన, ప్రాణ, అపానవాయువులు. |

పంచప్రదక్షణలు = పంచభూతములనుండి విముక్తుని చేసి, దేవుని యందైక్యము చేసుకొమ్మని కోరుట. (గుడి చుట్టూ తిరుగుట.)

పరలోకము నుండి = దేవునివద్దనుండి.

ప్రభావము = బుద్ధినుండి క్రొత్తగా పుట్టిన భావము.

ప్రతివాదము = అడిగిన ప్రశ్నకు జవాబును అందివ్వడము.

## బ, భ

బసుపురాలు = దేవుడు లేక దేవత పేరుపై వదిలివేసిన స్త్రీ.

బంగారు = పరమాత్మకు గుర్తు
(లోహములలో శ్రేష్టమైన లోహము.)

బంధువులు = బంధించువారు.

బద్ధ = కట్టబడి ఉన్నది.

బదనిక = చెట్టుపై మొలుచు మహిమగల మూలిక (భూమికి సంబంధము లేకుండ)

భగవద్గీత = భగవంతుడు ఏర్పరచిన హద్దు.

భగవంతుడు = భగమునుండి పుట్టినవాడు, గర్భమునుండి పుట్టిన వాడు.

భగము = గర్భము.

భయురశము = సోమరసము. (భక్తి,యుక్తి,రక్తి,శక్తి,ముక్తి)

భర్త = భరించువాడు.

భక్తి = విశ్వాసము, నమ్మకము.

భార్య = భరింపబడునది.

భార్యాభర్తలు = ప్రకృతి, పరమాత్మలను తెలియజేయు విధానము.

బ్రహ్మాండము = (బ్రహ్మ+అండము) పరమాత్మ చేత పుట్టబడినది.

బ్రహ్మయోగము = మనస్సు మీద తిరగబడడము, మనస్సు మీద పోరాటము.

భావ సేవ = గురువును భావములో గొప్పగా పెట్టుకోవడము.

బ్రహ్మచారి = బ్రహ్మచారి, (అబ్బాచారి) మంచి ఆచారముగలవాడు.

బ్రహ్మవిద్య = పెద్దవిద్య.

బ్రహ్మయోగి = బ్రహ్మయోగమార్గములో పోవువాడు. తన శరీరములోని మనస్సును అదుపులో పెట్టుకోవలసి ఉండును.

భ్రమ = తిరిగి వచ్చునది (మనస్సులో లేకుండాపోయి, ఒకప్పటికి తిరిగి వచ్చునది.)

భ్రమరము = తిరుగునది, బ్రహ్మవిద్యాశాస్త్రము=యోగశాస్త్రము.

భ్రాంతి = ఉన్నది లేనట్లూ, లేనిది ఉన్నట్లూ, భావించుకోవడము. (ఉదా :- రేపు)

బ్రాహ్మణులు = బ్రహ్మజ్ఞానము తెలుపువారు, బ్రహ్మజ్ఞానము ఇతరులకు తెలుపు పనియే ముఖ్యముగా పెట్టుకొని జీవనము సాగించెడివారు.

బ్రాహ్మణ = బ్రహ్మజ్ఞానము కలవారు.

బ్రహ్మము = అన్నిటికంటే శ్రేష్టమైన నాశనరహితమైనది, పెద్దది.

బాప్తిస్మము = ఉపదేశము.

బీ = కారణమైనది, పుట్టించునది.

బీజం = పుట్టుకకు కారణమైనది.

బియ్యము = జ్ఞాన చిహ్నాములు.

బిక్షాందేహి = జ్ఞానము కొరకు అడుక్కొనే వారు.
ఆత్మకొరకు జ్ఞానమును అడుగువాడు.

బిక్షాందేహ = శరీరము గురించి అడుక్కొనే వారు.

బీజాక్షరములు = వివరము, భావము, సారాంశము కల్గియున్నవి.

బుద్ధి = గుణానుసారిణి (ఆలోచన, యోచన),
గుణాతీతమైన ఆత్మభాగములోని జ్ఞానమును
గురించి బుద్ధి యోచించడము జరుగును.
(తెలియునది, చేయునది.)

బుద్ధికి తెలియునది = బాహ్యేంద్రియములకు తెలియని జ్ఞానమును
గ్రహించు సామర్థ్యముగలదు. బుద్ధికి తెలియబడే
మంత్రశక్తిని బుద్ధి చేతనే శోధించి తెలియాలి.

భూతము = జీవుడు (ఆధ్యాత్మిక పరిభాషలో)

భూతములు = జీవులు.

భూజములు = భూమినుండి పుట్టు వృక్షలతాదులు.

భూమి తత్త్వములు = గుదము, నోరు, చేతులు, పాదములు, లింగము
(కర్మేంద్రియములు)

భూషణ = దీవెనలు.

భూషణులు = దేవునిపట్ల వినయము, విశ్వాసము కలిగిన వారు.

భావము = భాషలో ఉండే అర్థము.

భు = పుట్టినది.

బేధము = ఒక గుణమునకు భిన్నముగా ఉండుదానిని బేధము అంటారు, వ్యతిరిక్త దిశలో ఉండునది.

బేవర్షి = సంతోషము లేనివాడు.

భోగములు = అనుభవించునవి (కష్టములు, సుఖములు)

భోగిపండుగ = సంక్రాంతికి ముందురోజు. దక్షిణాయణము పూర్తియగు రోజు, భోగములకు గుర్తు (ప్రాపంచిక సంబంధమైనది.)

భోగము = ప్రపంచ సంబంధ విషయములను అనుభవించుట.

భోగిమంటలు = జ్ఞానమను అగ్నిచే సర్వకర్మలను కాల్చునవి.

బోధకుడు = తెలియనివి తెలియజెప్పువాడు; వినిన దానినిగానీ, చదివిన దానిని గానీ, వివరముగా చెప్పువాడు.

బోధ = తెలియజేయునది.

బుద్ధునికి జ్ఞానోదయమైన ప్రదేశము = గయ అను ప్రాంతములో బోధి చెట్టు (రావిచెట్టు) క్రింద కూర్చొని యోచించుచుండగా జ్ఞానోదయమైనది. అప్పటినుండి 'గౌతమబుద్ధుని'గా పిలువబడెను.

బుద్ధుని పినతల్లి = గౌతమీదేవి క్షయరోగముతో తనతల్లి చనిపోగా, ఆయన పినతల్లి చిన్నప్పటినుండి సాకిన కారణమున ఆయనను అందరూ 'గౌతముడు' అని పిలిచెడివారు.

బౌద్ధమతము = ఆర్యులు మొట్టమొదట మతమును సృష్టించుటకు వాడిన పదము మతము ఇక్కడినుండి మొదలయినది. భారతదేశములో పుట్టిన

గౌతమబుద్ధుడు కలియుగము 2,500 సంవత్సరములు గడచిన తరువాత బుద్ధుడు తాను అనుభవములో పొందిన జ్ఞానమును ప్రజలకు చెప్పను మొదలిడెను.

బిందుపుత్రులు = భౌతిక తండ్రిచే కల్గినవారు.

భోగి = కర్మ అనుభవములకు గుర్తు.

## మ

మరణము = చివర, ఆత్మ, జీవాత్మలు శరీరమును వదలి పోవడము; శరీరమను యంత్రము పని చేయకుండా నిలిచిపోవడము.

మఠము = యోగి నివాసము చేయునది, మోక్షము.

మంత్రము = మంత+రము, శరీరములో యున్న గ్రహ శక్తిని నాశనం చేయునది (మంత్రము మాటగా యుండును.)

మ = నేను, నా.

మమ = నాయొక్క, నాది (ఆత్మ=మామ)

మమ మాయా = నా మాయ.

మహా = గొప్ప.

మతి = మనస్సు, ఎరుక, జ్ఞానము.

మనస్సు = విషయమును (జ్ఞాపకము) మననము చేయునది, చంచలమైనది, వేగవంతమైనది.

| | | |
|---|---|---|
| మకర సంక్రాంతి | = | ఉత్తరాయణము ప్రారంభము (ఆరు నెలలు) ఉత్తమమైనది. (జ్ఞానమునకు గుర్తు) |
| మంగళవారము | = | కుజుని దినము, నాశన దినము, లయకు గుర్తుగా ఉన్న దినము, శుభకరమైన దినము, జీవుని అంత్యమును తెలుపు దినము. |
| మత్తుపదార్థములు | = | శరీర పోషణకు ఉపయోగపడక, మానసిక సుఖమును కల్గించునవి. |
| మాంసాహారము | = | మాంసమునుండి వచ్చునది ఉదా॥ పక్షులు, జంతువులు, చేపలు, మృగముల నుండి వచ్చునది, గ్రుడ్డు, పాలు, మాంసము, నెయ్యి. |
| మత్‌కర్మ | = | నా పని. |
| మది | = | మనస్సు |
| మల | = | అడవి. |
| మర | = | యంత్రము |
| మనోనేత్రము | = | ప్రపంచ విషయములను చూపును. |
| మరణించుట | = | గతించుట, చచ్చుట. |
| మతము | = | దేవునిమార్గములో ఒక్క దానిని మాత్రము ఇష్ట పడడము, ఒప్పుకోవడము. |
| మహర్షి | = | గొప్ప సంతోషి, ఆత్మానుభూతిని చెందువాడు (బ్రహ్మానందము, సచ్చిదానందము), ఆనంద. |
| మదము | = | గర్వము |
| మత్సరము | = | అసూయ. |
| మంగళ | = | శుభకరమైన. |

మమకారము = మోహగుణము.

మఠము = యోగి నివాసము చేయునది, మోక్షము.

మణిపూరక చక్రము నడుపు శ్వాసల సంఖ్య = 6000 (ఆరువేలు)

మహాత్య = (మహా+అత్య) గొప్పగా జీవింపజేయడము.

మహత్యములు = మూడు రకములు 1) హస్తలాఘవము, 2) తాను నేర్చిన ఒక రకమైన విద్య, 3) మనిషికి తెలియకుండా జరుగునది. రెండు రకముల విద్యలను మనిషి నేర్చుకోవచ్చును. మూడవ రకము ఏ మనిషీ చేయలేడూ, నేర్వలేడు. సూక్ష్మముగా జరుగునది. (ప్రకృతి మాయచే చేయునది.)

మహర్షయ సప్త = ఆత్మ యొక్క ఏడు భాగములు; సప్త నాడీకేంద్రములు, సప్త గ్రంథులు.

మంత్రశక్తి = మంత్రము ద్వారా ఉపయోగపడు గ్రహశక్తి.

మహాభూతములు = పరమాత్మ ఆధీనములో ఉండును. (శరీరము బయట).

మహాభూతముల శక్తి = అపరిమితము.

మంగళ = ప్రపంచములోనే అత్యున్నతమైన శబ్దము (మోక్షము)

మర్మజ్ఞుడు = ఆత్మను తెలిసినవాడు.

మంత్రము = మహిమగలది, శక్తిగలది.

మంత్రములలో మధ్యలో ఉన్నది. = ఆత్మకు సంబంధించిన బీజాక్షరములు.

మః = గాలియొక్క బీజాక్షరము.

మనువు = సృష్ట్యాదిలో సూర్యుడు (వహీద్వారా) తెలుసుకొన్న జ్ఞానమును భూమండలము మొత్తములో మొట్టమొదట సూర్యుని ద్వారా జ్ఞానమును తెలుసుకొన్న వ్యక్తి.

మితవాదము = ప్రశ్నకు చెప్పబడిన జవాబు సరియైనదయినా, సరియైనది కాకపోయినా దానిని ఎదురు మాట్లాడక ఒప్పుకోకపోవడము.

మతము = సమ్మతము, ఓటు.

మతము = మనిషికి సంబంధించిన ఇష్టము, ఉద్దేశ్యము కాదు.

మత్‌దాన్‌కరో (హిందీ) =మతదానము చెయ్యండి, నీ సమ్మతమును (ఓటు) నాకు ఇవ్వండి అని అర్థము.

మిత్రగుణములు = (మంచిగుణములు) ఆరు (6) దాన, దయ, ఔదార్య, వైరాగ్య, వినయ, ప్రేమ.

మాతా = నిన్ను పోషించునది.

మాచకమ్మలు = దేవదాసీలు, (నపుంసక స్త్రీలు)

మాయకు గుర్తు = పగలు.

మాన్యులు = పూజింపతగినవారు.

మాంత్రికుడు = మంత్రబలము ఉపయోగించువాడు.

మాయ = ప్రకృతి అంశతో తయారైనది. స్త్రీ సంబంధమైనది, రూపములేనిది, శరీరములో గుణముల విధానములో ఉన్నది, గుణచక్రములోని మూడు భాగముల సముదాయము.(ఒక్కొక్క భాగమునకు

12 గుణములచొప్పున మూడు భాగములు) అన్ని గుణములను మాయ అనవచ్చును.

మైథునము = మిథునము (స్త్రీసాంగత్యము)

మనుషులు = మానవులు (ఆనాడు మనువు, మానవులు ఇట్లే ఉండవలెనని సూచించాడు. మనువు వలననే మనువు నడవడికలను పుణికి పుచ్చుకున్న మనుషులకు మానవులని మనుష్యులని పేరు వచ్చినది.) మనువు ద్వారానే మానవ జాతికి 'మానవులు' అను పేరువచ్చినది.

మండోదరీదేవి = రావణుని భార్య.

మానము = కొలత (మనిషికి ఉన్న విలువ)

మాదిగ = ఏమాత్రము జ్ఞానము లేకుండ, జ్ఞానము కలవారి కంటే తక్కువవారని అర్థము.

మూడు నామములు = ఇడ, పింగళ, సుషుమ్న నాడులు, లేక సూర్య, చంద్ర, బ్రహ్మనాడులు.

ముహూర్తము = మూడక్షరములకు సూచన (ప్రకృతి)

ముండ = మనస్సు, వ్యభిచారి, చపలత్వము గల స్త్రీ,

మూసి = మూసివేయడము.

ముసలము = అజ్ఞానము.

ముహ్కమాత్ = స్థూల విషయములతో కూడుకొన్నవి.

ముతషాభిహాత్ = సూక్ష్మవిషయములతో కూడుకొన్నవి.

మూయడము = కనిపించకుండా లేకుండా చేయడము.

ముండమూసి = వ్యభిచారము లేకుండ చేయడము.

ముల్లోకములు = మూడు గుణములు (తామస, రాజస, సాత్త్విక)

మూడు నామములు = జీవాత్మ, ఆత్మ, పరమాత్మ (క్రిందినుండి పైకి)

ముస్లీమ్ = దేవుని మీద విశ్వాసముకలవాడు.

మూర్ఖత్వము = ప్రపంచ జ్ఞానము తెలియనప్పుడు కల్గునది.

మూఢత్వము = దైవజ్ఞానము తెలియనప్పుడు కల్గునది.

ముప్పు = ప్రమాదము, అపాయము.

మూర్ఖము = అజ్ఞానము.

మూఢము = చీకటి

మూడు చెరువుల నీళ్లు = మూడు గుణముల విషయములు.

మోక్షము = విడుదల, కర్మరాహిత్యము; సర్వ నరకములకూ అతీతమైన దేవుని సన్నిధానము; ఆరు చెడు, ఆరు మంచి గుణములు లేకుండా పోవుట.

నాల్గవదైన యోగము తరువాత ఉన్నది. ఐదవ తరగతి మోక్షమే, మానవునికి చివరి తరగతి. దానినే బయలనీ, అచేలమనీ, ముక్తియనీ, పరమపదమనీ, పరలోక రాజ్యమనీ అనేక రకములుగా చెప్పుచుందురు.

మోహ గుణము = మనిషిని నిజముగ తానెవరో తెలుసుకోకుండా చేయునది.

మెట్టుట = జీవితమును సాగించుట.

మెట్టినిల్లు = జీవితమును సాగించునది.

మెట్టెలులేని స్త్రీ = ఆత్మలేని ప్రకృతి (భర్తలేని భార్య)

మొదటి విద్య (ప్రాపంచికము) = టక్కుటమారా, ఇంద్రజాల, మహేంద్రజాల, గజకర్ణ గోకర్ణ (మనకు వినిపించని శబ్ధమును విని చెప్పడము) ప్రాపంచిక విద్యలు

మృతము = మరణము, నాశనము (జీవాత్మ)

మౌఢ్యము = అజ్ఞానము.

ముక్తి = జన్మలేని తనము.

## య

య = భూమి యొక్క బీజాక్షరము.

యమ = పెద్ద, గొప్ప.

యతి = యరసినవాడు, జ్ఞాని.

యరసినవాడు = తెలిసినవాడు.

యమధర్మరాజు = పెద్ద ధర్మరాజు (దేవుడు), యమముకలవాడు, నియమములేనివాడు.

యముడు = దేవుడు.

యజ్ఞము = అన్నిటినీ లేకుండా చేయడము, కాల్చివేయడము.

యజ్ఞ = కాల్చుట

యుక్తి = యోచన.

యాదవులు = జ్ఞానము కలిగినవారు.

యాదవ = ఎల్లప్పుడు తమమీద తాము జ్ఞాపకము కలవారు.

యాంత్రికుడు = యంత్రమును ఉపయోగించువాడు.

యుగములు = యోగములు (యుగములు అను పదమునకు అర్థము లేదు.)

యుద్ధము = నాశనము.

యుగాది (యుగ+ఆది) = సృష్టి ప్రారంభమైన రోజు, ప్రపంచము పుట్టిన దినము.

యోగీశ్వరుడు = యోగమును పూర్తి చవిచూచిన తరువాత యోగమును కూడ అతిక్రమించిన వాడగును. అటువంటి వానిని "యోగీశ్వరుడు" అని అందురు.

యోగుల పదవులు = 1) ఆనంద, 2) రాజానంద 3) దేవానంద 4) బ్రహ్మానంద.

యోగుల తరగతులు = 1) మహర్షి – పావు భాగము శక్తి.
2) రాజర్షి – అర్థ భాగము శక్తి.
3) దేవర్షి – ముప్పావు భాగము శక్తి.
4) బ్రహ్మర్షి – నూరు భాగముల శక్తి.

యోగి = యోగములో ఉండినవానిని 'యోగి' అనవచ్చును; యోగము చేసినవాడు.

యోగము = జ్ఞానము. దైవసంబంధమైన ఆత్మను అనుభవించుట. (యోగములో కర్మలు కాల్చివేయబడుచున్నవి.), మనస్సు చలించకుండా నిశ్చలముగా నిలుపుట, ఆత్మ ధర్మములను ఆచరించడము, జీవుడు ఆత్మయందు లీనము కావడము, కలయిక, దేవున్ని చేరు విధానము, దేవునియందు ఐక్యమైపోవుట.

యోచనలు = శరీరాంతర్గత దృష్టిని కలుగజేయునవి.

యోగక్షేమము = యోగము యొక్క క్షేమము. (జ్ఞానమార్గములో పయనించు జీవునికి, జ్ఞాన సంబంధమైన అడ్డంకులు లేకుండ చేయడము)

## ర

ర = నాశనము

రక్షణ = పాపవిముక్తి.

రచ్చ = బయట, బయలు.

రక్తి = ఆచరణ.

రాజస జ్ఞానము = సర్వజీవరాశులందు భావమును బట్టి అందులోని పరమాత్మ కూడా వేరువేరుగా ఉన్నాడని తెలుపు జ్ఞానము.

రాజరికము = జ్ఞాన, యోగ సామ్రాజ్యమును పాలించుట.

రాజస సుఖము = విషయములు ఇంద్రియములు కలిసి ఏకమై ఆదియందు అమృత సమానముగా తోచు సుఖము, పోనుపోను పరిణామము చెందుచు చివరకు విషముతో సమానముగా కనిపించు సుఖము.

రాజస ధైర్యము = మిక్కిలి ఆసక్తిగల ఫలకాంక్షచే ధర్మముయందును ధనము కొరకు ఆశను కలుగజేయు ధైర్యము.

రాజస బుద్ధి = ఇది ధర్మమని, ఇది అధర్మమని, ఇది కార్యమని ఇది అకార్యమని ఉన్నదున్నట్లు తెలియజేయలేక పొరపాటుగా వేరుదానిని సూచించు బుద్ధి.

రాజస కర్త = బంధువుల మీద ప్రేమ కలిగి కార్యములలో లాభమును కోరువాడై, లోభియగుచు హింస

| | |
|---|---|
| | చేయువాడై, శుభ్రత లేనివాడై, సంతోష దుఃఖములకు చలించువాడు. |
| రాజస కర్మ | = కోర్కె కలవాడై మిక్కిలి ప్రయాసతో, కర్త తానన్న అహంభావముతో గర్వపడుచు చేయు కర్మ. |
| రాశి | = కుప్ప, కర్మచక్రములోని స్థానము, కర్మకూడలి. |
| రా | = రహితము, త్రి = భూత, భవిష్యత్, వర్తమానములైన మూడు కాలములు. |
| రాత్రి | = మూడు అవస్థలు లేనిది, మూడు గుణములు లేనిది, మూడు కాలములు లేనిది, పరమాత్మ స్వరూపమైనది (దైవము), చీకటి, తెలియబడనది. |
| రాత్రింబగళ్ళు | = దైవ స్వరూపమైన 'రాత్రి' నుండి 'మాయ' స్వరూపమైన 'పగలు' పుట్టినది. |
| రెక్కల గుఱ్ఱము | = మనస్సుకు గుర్తు |
| రాగము | = ప్రేమ, |
| రాహువు | = విషమునకు, విష సర్పములకు అధిపతి. |
| రజోగుణము | = రాజస గుణ భాగములోని గుణములు ప్రపంచ విషయములందు ప్రీతి కలుగజేయునవై వాటియందు ఆసక్తి, ఆశను పుట్టించునవై ఆ పనులయందే తగులుకొనునట్లు చేసి, జీవుని బంధించుచున్నవి. |
| రాగి | = జీవునకు గుర్తు (లోహము) |
| రాగద్వేషము | = ప్రేమ, అసూయ. |
| రామ | = నేను అనునది నాశనము కావలెనని అర్థము (అహము) |

రాముడు ప్రయోగించిన బాణమునకు పూచిన విషపదార్థములు = రాతికప్ప చర్మములోని నూనె, రాతిబల్లి చర్మములోని బుడిపెల జిగురు రెండూ అత్యధిక విషప్రభావము గలవి. అవి చర్మములోనికి చొచ్చుకొనిపోతే మనిషి అరనిమిషములో అపస్మారకస్థితిలోనికి పోయి, ఐదారు నిముషములలో చనిపోవును.

రం = బీజాక్షరము. నాశనమునకు బదులు వాడే పదము.

రంగ = చావుపుట్టుకలు, గతులు లేకుండా చేయువాడు. అనగా మోక్షము నిచ్చువాడు.

రుచి = జీవుని సంబంధమైనది.

రుద్రము = నాశనము

రుద్రభూమి = శరీరము నాశనమగు భూమి.

రుద్రుడు = రుద్రభూమియందు సంచరించువాడు, భూత, ప్రేత, పిశాచముములు, యక్ష, కిన్నెర, కింపురుష, గరుడ, గంధర్వ గ్రహాలు అనేకము నివసించు చుండును. వీటన్నిటికీ రుద్రుడు అధిపతి.

రుద్రాక్ష = (రుద్ర+రక్ష) వీటిని ధరించుట వలన పిశాచ గణముల బాధలుండవని పూర్వమనుకొనెడివారు. రుద్రాక్షలు వేసుకొనుట వలన శరీర ఆరోగ్యములు కూడా చేకూరును. అన్నిటికంటే ముఖ్యముగా దయ్యాల బాధల భయమునకే వాటిని వాడవచ్చును.

రూప,నామ,క్రియారహితుడు = రూపము, పని, పేరు లేనివాడు (దేవుడు)

రి = పాలన

రెక్కల గుర్రము = వాయువేగముకంటెను, ఎక్కువ వేగము కలది. 'మనస్సు' అని గుర్తు.

రోజా = ఉపవాస వ్రతము (పవిత్ర ఖురాన్)

రావణబ్రహ్మ = శ్రీలంక రాజ్యమునకు అధిపతి, మహామేధావి, దైవజ్ఞానము సంపూర్ణము తెలిసినవాడు, జీవాత్మ, ఆత్మ, పరమాత్మ అను మూడు ఆత్మల జ్ఞానము తెలిసినవాడు, త్రేతాయుగ కాలములో భూమండము మొత్తము మీద అత్యధిక యోగశక్తిగల యోగి, త్రికాల జ్ఞాని, భూత, భవిష్యత్, వర్తమాన కాలములు అను మూడు కాలములు తెలిసినవాడు.

## ల

లగ్నము = ఖగోళ సంబంధమైనది (నిర్ణీత పొడవు వెడల్పు గల ప్రదేశము), కాలచక్రములోని స్థానము, అంటి పెట్టుకొనియున్నది.

లయ = మోక్షము.

లోకము = గుణ భాగము.

లంజముండ = వ్యభిచరించు స్త్రీ.

లా ఇలాహి ఇల్లల్లాహ్ = దేవుడొక్కడే (పవిత్ర ఖుర్ఆన్)

| | |
|---|---|
| లింగము | = పురుషునకు గుర్తు (అనగా పరమాత్మ ప్రపంచమునకు భర్త) |
| లోకము | = కంటికి బాగా కనిపించునదని అర్థము. |
| లోచన | = కనిపించునది, చూడబడునది. (చూచుట) |
| లోచనములు | = అద్దములు. |
| లోభము | = పిసినారి తనము. |

## వ

| | |
|---|---|
| వలపు | = ఆకర్షణ |
| వహీ | = శబ్దసందేశము (పవిత్ర ఖురాన్) |
| వక్త | = బోధించువాడు, వివరము చెప్పువాడు. ఒక విషయము గురించి బాగా మాట్లాడువాడు (ప్రాపంచికము). |
| వర్గములు | = వేరువేరు గుంపులు. |
| వర్ణమ్ | = రంగులు (వర్ణములు), వేరువేరు రంగులు. |
| వర్గము | = గుంపు. |
| వత్స | = కుమారుడు. |
| వా | = నీరు యొక్క బీజాక్షరము. |
| వాదము | = వాదన, మనిషికీ మనిషికీ మధ్యన భావమును తెలుపునది. |
| వాలి,సుగ్రీవులు | = అటవీప్రాంతములను పాలించు కొండరాజులు (అన్నదమ్ములు) |

వాయుతత్త్వములు = వ్యాన వాయువు, సమానవాయువు, ఉదాన వాయువు, ప్రాణవాయువు, అపానవాయువు.

వ్యాఘ్రవృక్షము = పులినుండి లేక ఇతర జంతువుల నుండి రక్షణ నిచ్చే చెట్టు

వార్తాహరుడు = మనస్సు (వార్తలను చేరవేయువాడు)

వ్యవసాయా = పండునది, శాస్త్రబద్ధమైనది, సత్యము, జరిగి తీరునది.

వ్యయము = నాశనము.

విశుద్ధ చక్రము నడుపు శ్వాసల సంఖ్య = 1000 (వేయి)

విశ్వాసము = భక్తి.

విశ్వరూపము = విశ్వము (ప్రపంచము+జగతి) అంతటా పరమాత్మ శక్తియే నిండివున్నదని జ్ఞానము వలన అర్థము కావడము.

వి = ఆత్మకు గుర్తు (జీవాత్మ, పరమాత్మలతో సంబంధమున్న ఆత్మ కలయిక జ్ఞానము కలవారను సూచన.)

వికర్మ = ప్రారబ్ధకర్మ ఆచరణ వుండదు, క్రొత్త కర్మరాదు, అన్నీ స్తంభించి కర్మలన్నీ నిలిచిపోవడము (బ్రహ్మ యోగులకు)

వికారములు = గుణముల వలన కలుగు భావాలు.

విదియ = రెండవది (తిథి)

విషయము = విషము అను పదమునుండి పుట్టినది.

విధి = ప్రారబ్ధకర్మ.

| | | |
|---|---|---|
| విశ్వము | = | జగతి+ప్రపంచము. |
| విగ్రహ | = | సూక్ష్మశరీరము. |
| విద్య+అర్థి=విద్యార్థి | = | విద్యను అర్థించువాడు. |
| విగ్రహము | = | ప్రతిమ శరీరములోని సూక్ష్మశరీరము. |
| విద్య (విత్) | = | తెలియగల్గడము, నేర్వగల్గడము (జ్ఞానము). |
| వేదములు | = | ప్రకృతి జనితములు. |
| వేట | = | శరీరములో యోగమాచరించడము. |
| వెండి | = | ఆత్మకు గుర్తు (లోహములలో) |
| వెన్నతో పెట్టిన విద్య | = | జ్ఞానము. దైవజ్ఞానము ఎవరికుండునో అతనిని వెన్నతో పెట్టిన విద్యకలవాడని చెప్పవచ్చును. |
| వేదాంతము | = | గుణాతీతము. |
| వేశ్యలు | = | శరీరము అమ్ముకొను వృత్తిగలవారు. |
| వర్ధంతి | = | చావులో 24 భాగములతో కూడుకొన్న శరీరము నిన్ను వదిలిపోవుచున్నది. అదియే వర్ధంతి. |
| వివాహము | = | ఇద్దరికీ వర్తించునదని అర్థము. |
| విభూతులు | = | మహిమలు. |
| వియోగము | = | విడిపోవుట, యోగముకానిది. |
| వైశ్యులు | = | వస్తువులను అమ్ముకొను వృత్తిగలవారు. |
| వైశ్వానరుడు | = | అగ్ని దేవుడు, దహించువాడు. |



# శ, ష

| | | |
|---|---|---|
| శత | = | నూరు. |
| శంకరుడు | = | త్రిమూర్తులలో ఒకరు (రుద్రుడు). |
| శంఖు | = | జ్ఞానబోధ. |
| శయనాధిపతి | = | పరమాత్మ, విష్ణువు. |
| శవము | = | శివము (తెలియనిది, పరమాత్మ) |
| శస్త్రశక్తి | = | స్థూలశక్తి (శస్త్రము) |
| శత్రు గుణములు | = | కామ, క్రోధ, లోభ, మోహ,మద, మత్సరములు. |
| శ్రద్ధ | = | ఇష్టము. |
| శక్తి | = | సూక్ష్మముగా కర్మను కాల్చు శక్తి. స్థూలముగా బలము. |
| శనివారము | = | చివరి దినము. |
| శాస్త్రి | = | శాస్త్రము తెలిసినవాడు. |
| శాంతి | = | శరీరములో గుణములు లేని కాలము. |
| శాఖాహారము | = | శాఖలనుండి వచ్చు ఆహారము ఉదా।। మొక్కలు, చెట్లు, వృక్షలతాదులనుండి వచ్చునది. |
| శాస్త్రము | = | ఒకే విధానము చూపించునదై, శాసనములతో కూడుకొని ఉన్నది, ఖండింపబడనిది, నెరవేరునది. (మారునది కాదు.) |
| శ్వాస | = | ప్రాణము. |
| శుద్ధము | = | పవిత్రము. |
| శూద్రులు | = | పవిత్రులు. |
| శాసనము | = | తప్పనిసరిగా జరిగితీరునది, తూచ తప్పకుండా నెరవేర్చబడునది. |

శాపము = ఇటు పరిశోధన లేకుండా, అటు అధికారము లేకుండా చెప్పినది జరుగు విధానము, తప్పనిసరిగా జరుగునది (మంచిగానీ, చెడుగానీ)

శివము = గుర్తించలేనిది, అంతటా ఉన్నది, దేనికీ తెలియనిదీ, జ్ఞానులకు యోగులకు కూడా తెలియనిది.

శిలువ = పాము.

శ్రీకృష్ణ = పరమాత్మకు సూచన. నలుపు (చీకటి, రాత్రి) దేవునికి గుర్తు.

శివుడు = త్రిమూర్తులలో ఒకరు.(త్రిమూర్తులకు అధిపతి ఒకరే, ఆయనే పరమాత్మ)

శిక్ష = నరకము, దుఃఖము, నాశనమునకు సంబంధించి నది.

శివం = తెలియనిది, పరమాత్మ.

శి = అడ్డులేకుండ, శీఘ్రముగ (అగ్ని యొక్క బీజాక్షరము.)

శివ = అగ్నికి, నీటికి గుర్తుగ ఉన్న బీజాక్షరములు.

శ్రీ = పరమాత్మకు సూచన, శుభకరమైన.

శ్రీమతాం = శుభ్రప్రదమైన ఆత్మజ్ఞానము కలవారు.

శ్రీమంతాం = ధనికులు.

శ్రేష్ఠుడు = జ్ఞానము తెలిసినవాడు.

శుక్రగ్రహము = మత్తు పానీయములకు అధిపతి.

శోధించుట = పరీక్షించుట.

శోభ = ప్రకాశము, వెలుగు.

శోభనము = స్త్రీ, పురుషులిద్దరికీ వారి ఆధ్యాత్మిక జీవన ప్రారంభ దినము. జ్ఞానము ప్రకారము నడచిన వారికి శోభనము అయినట్లు, నడవని వారికి కానట్లు (మొదటి దినము, మొదటి రాత్రి) శోభిల్లుట, ప్రకాశించుట.

శివరాత్రి = కర్మనాశనమగు మోక్షరాత్రి (మోక్షప్రాప్తికి గుర్తు)

శివరాత్రి జాగరణ = మాయనుండి జాగృతి చేయుట (జాగ్రత్తపడుట)

శ్రీమతి = పరమాత్మ జ్ఞానమునకు చిహ్నము. (దైవజ్ఞానము కలదని అర్థము.)

శ్రేష్ఠి = శ్రేష్టమైనవారు. ప్రపంచ శ్రేష్టతను, జ్ఞాన శ్రేష్టతను గురించి తెలియజేయునది, ప్రపంచ జ్ఞానము పరమాత్మ జ్ఞానము రెండూ కలవారు.

## స

సమాధి = ఆత్మ, జీవాత్మలు ఎక్కడ నిక్షిప్తమగునో అదియే సమాధి, క్రొత్తగా శరీరమునుండి లేపబడుట (పుట్టుక), అందరికీ సమముగా వర్తించునది. అందరికి సమానముగా ఉండునది (సృష్టి మొదటినుండి)

సంక్రాంతి = మంచి తిరుగుబాటు, కర్మ నాశనమైన యోగమునకు గుర్తు

సమత = సామెత, సమానము

స్వరితము = సమానము, ఒకే తూకముగలది.

సంకరము = ఉన్నదున్నట్లుండక ఇంకొక దానితో కలిసిపోయి వేరుగా మారిపోవడము.

సహచరుడు = వెంటపుట్టువాడు, వెంటతిరుగువాడు.

సహజ = వెంటపుట్టునది.

సహజత్వము = పుట్టుకతోనే వచ్చునది.

సత్తు = ఆత్మ, శరీరములోని మొత్తము సారాంశము (శక్తి)

సమాజము = సమముగా పుట్టునది.

సజీవ శరీరము = 25 భాగములుగ ఉన్న శరీరము.

స్వర్గము = మనము అనుభవించు సుఖములు.

స్థాన సేవ = గురు స్థానమును శుచి శుభ్రముగా ఉంచుట.

సంసారము = మంచి రుచి కలది.

సం = మంచి.

సారము = రుచికలిగిన

సోమవారము = చంద్రుని దినము, ఇందువారము, సృష్ఠి తర్వాత రెండవ దినము (మూన్ డే) దైవ ధర్మమును తెలుపు జ్ఞానమునకు గుర్తుగాయున్న రోజు.

సంవత్సరము = మంచి కుమారుడు. దేవునికి మంచి పుత్రునిగా, అక్షయునిగా పేరుగాంచినవాడు.

సహస్రార చక్రము నడుపు శ్వాసల సంఖ్య = 1000 (వేయి)

సాంఖ్యము = శరీరములో మొత్తము జీవుని మినహా 24 భాగములున్నవని తెలియడము, శరీరములో

జరుగు యంత్రాంగము మొత్తమును కలిపి సాంఖ్యము అందురు.

సిద్ధార్థుడు = మోక్షమును అర్థించువాడు, ముక్తిని అడుగువాడు.

స్త్రీలకు ఎక్కువ ప్రభావముగల చెడు గుణములు = క్రోధము, మోహము, మత్సరము. (సరిసంఖ్యలు)

స్త్రీలకు ఎక్కువ ప్రభావముగల మంచి గుణములు = దయ, వైరాగ్యము, ప్రేమ, (సరిసంఖ్యలు)

స్వర్గము = సుఖాల నిలయము, సుఖములు అనుభవించు స్థలము (భూలోకము), పుణ్యము వలన వచ్చునది, దేవుని జ్ఞానము లేని సుఖములు (ప్రపంచ సంబంధము)

సనాతన ధర్మము = ఆదినుండి ఉన్న ధర్మము.

సంఖ్యల వివరములు = ఆధ్యాత్మికములో బేసి సంఖ్యలు ముఖ్యమైనవి.

1. (ఒకటి) = ఏక పరబ్రహ్మము (పరమాత్మకు గుర్తు)

3. (మూడు) = ఒకే పరమాత్మ మూడు ఆత్మలుగ విభజింపబడినది. ఆత్మ, జీవాత్మ, పరమాత్మలు మూడు సంఖ్యకు గుర్తు.

5. (ఐదు) = ప్రకృతి ఐదు భాగములుగ ఉన్నది. శరీరములో ఆకాశము, గాలి, అగ్ని, నీరు, భూమి అను ఐదు ప్రకృతి భాగములకు గుర్తు.

7. (ఏడు) = పంచభూత నిర్మితమైన శరీరములో ఆత్మ ఏడు నాడీకేంద్రముల ద్వారా శక్తిని ఏడు గ్రంథుల ద్వారా ఆరోగ్యమును పంచుచున్నది. ఆత్మ శరీరములో

| | | |
|---|---|---|
| | | వ్యాపించు ఏడు నాడీకేంద్రములకు గుర్తుగా, ఏడు గ్రంథులకు ద్వారములు, గోపురములు గుర్తులు ఆధ్యాత్మికములో ఉంచారు. |
| 9. (తొమ్మిది) | = | శరీరములో తొమ్మిది గ్రహముల ద్వారా కర్మ తొమ్మది విధములుగా జీవునిమీద ప్రసరించబడుచున్నది. కావున తొమ్మిది గ్రహములకు గుర్తుగ తొమ్మిది సంఖ్యను ఉంచారు. |
| సంచిత కర్మ | = | జన్మ జన్మలకు అనుభవించగా మిగులుచూ వస్తూ, కుప్పలాగా పేరుకు పోవుచున్నది. అదియే సంచితకర్మ. |
| సన్న్యాసి | = | ప్రేమ, అసూయలు, కష్టసుఃఖములు అను ద్వంద్వ ములైన గుణములు వదలి, వాటి ఫలితముల మీద ఇష్టము లేనివాడై జరుగుచున్న పనులు కర్మరీత్యా జరుగుచున్నవని, వాటి అనుభవములు కర్మరీత్యా వచ్చునవేనని, మంచి చెడు అను బేధము లేక శరీరము ద్వారా పనులు చేయుచు తాను వేరను భావము కల్గివున్న కర్మయోగి. |
| సంగీతము | = | మంచి జ్ఞానము కల్గినది. |
| సర్పసంతానము | = | మాయ మార్గములో ఉన్నవారు. |
| సంస్కృతి | = | మంచిగా చేయబడినది. |
| సమ్ | = | మంచి. |
| స | = | భక్తి. |

| | | |
|---|---|---|
| సం | = | జ్ఞానము (మంచి) |
| సంత్ | = | భక్తులు |
| సర్వధారి | = | సర్వశరీరములను ధరించి ఉండునది. (సంవత్సరముల వరుసలో 22వది.) |
| స్వధర్మము | = | జీవుని ధర్మము. |
| స్వస్థతపరచుట | = | ఆరోగ్యవరుని చేయుట. |
| స్వ | = | సొంత |
| స్వగతము | = | జ్ఞానులందరూ సమావేశమై, జ్ఞానవరముగ గతము గురించి చర్చించుకొనే సభ (సమావేశము) |
| సుస్వగతము | = | మంచిదైన గతమును సూచించునది. |
| స్వర్గలోకము | = | కనిపించెడు సుఖములు. |

స్వాధిష్టాన చక్రము నడుపు శ్వాసల సంఖ్య = 6000 (ఆరువేలు)

| | | |
|---|---|---|
| సాకార పద్ధతి | = | పరమాత్మయే భగవంతునిగా పుట్టినపుడు కనిపించు శరీరముగల ఆ భగవంతున్ని పూజించడము, నమస్కరించడము, మనము భక్తులుగా ఉండడము సాకారపద్ధతి. |
| స్వాహా | = | అయిపోయినది, పూర్తి, అంతము. |
| సాతాను | = | మాయ. |
| సైతాను | = | మాయ. |
| సామెత (సమత) | = | ఉదాహరణకు సమానమైన అర్థమగుపదమును ముందు చెప్పి, దానికి సమానముగ అర్థముకాని విషయమును చెప్పితే సులభముగా అవగాహన కాగలదని చెప్పునది. |

| | |
|---|---|
| సోమరసము | = సురాపానము, అమృతము (మత్తుపానీయం) |
| స్థాపించడము | = పూర్తి లేనిదానిని నెలకొల్పడము, లేనిదానిని నిర్మించడము. |
| సింహతలాటము | = ప్రభావలి, మాయ (దేవాలయములలో సాకార ప్రతిమగా ఉన్న భగవంతుని ప్రతిమ చుట్టూ మాయ ఆవహించి ఉన్నట్లు గుర్తుగా సింహతలాటము పెట్టియుందురు.) |
| స్వప్నములు | = స్వపనములు, బాహ్యములో ఇతరులతో సంబంధము లేకుండా అనుభవించ వలసిన కర్మలను స్వప్నములో అనుభవింతురు. |
| సూక్ష్మములో మోక్షము | = కర్మ, బ్రహ్మ యోగములు చేయకనే నేరుగా, సులభముగా మోక్షము పొందడం. |
| స్వయంభూ | = దేవుని యొక్క అంశ తండ్రి వీర్యముతోగానీ, తల్లి అండముతోగానీ, సంబంధము లేకుండ జన్మించువాడు, స్వయముగ పుట్టువాడు (పరలోక సంబంధమగు జననము) |
| సత్త్వగుణము | = సాత్త్విక భాగములోని గుణములు సుఖమునందు ఆసక్తి కల్గించి, జ్ఞాన సుఖములలోనే బంధించును. జ్ఞానసుఖము అనగా ఇచట దైవజ్ఞానమేనని అనుకోకూడదు. ప్రపంచ విషయజ్ఞానమని అర్థము చేసుకోవాలి. సాత్త్వికులు క్రొత్త విషయములను తెలుసుకొనుటలోనే ఎక్కువ లగ్నమై ఉందురు. తెలియనివాటిని తెలిసికొనుటకు ఆసక్తి |

కలిగి, ఆసక్తిలోనే మునిగి కొత్తవాటిని తెలుసుకొని, ఇంకా కొత్త వాటిని తెలుసుకొనే సుఖమునందే ఉండడమును సాత్త్విక జ్ఞానము అంటారు.

సాకారుడు = ఆకారము కల్గినవాడు.

సాధారణ యోగి = సాకార రూపము గురించి ఏమాత్రము తెలియక యోగము మాత్రము తెలిసినవాడు.

సున్నా = సూత్రములు, శాసనములు

స్పృహ = గుణములు లేనటువంటి.

స్త్రీరత్న = కదలని మూలిక.

సౌభాగ్యము = అన్నింటినీ మించిన భాగ్యము (మోక్షము)

సైన్సు ఫిలాసఫి = విజ్ఞానము (5 రకములు)

సిగ్నేచర్ = ప్రకృతికి గుర్తు

సిగ్ = గుర్తు, నేచర్ = ప్రకృతి

సూత్రము = మనిషిలోని మనస్సును బట్టి జ్ఞాపకము, బుద్ధిని బట్టి జ్ఞానము లభించునని చెప్పునది సూత్రము.

సంతకము = జ్ఞానములేనిది.

సిద్ధి = పని చేయుటకు అన్ని విధముల సిద్ధముగా ఉన్నది.

స్థూలశరీరము = 25 భాగములలో 10 భాగముల శరీరము కంటికి కనిపించు శరీరము.
5 జ్ఞానేంద్రియములు+ 5 కర్మేంద్రియములు.

సూక్ష్మశరీరము = 15 భాగములైన లోపల శరీరము. 5 ఇంద్రియ

శక్తులు+ 5 వాయువులు+ 5 అంత:కరణములు, కంటికి కనిపించని శరీరము.

సులోచనములు = బాగా కనిపించునట్లు చేయు కంటి అద్దములు.

సూక్ష్మము = కనిపించునది కాదు.

సుఖ, దుఃఖములు = పాప, పుణ్య ఫలితములు.

స్వల్ప భూతములు = శరీరము లోపల ఆత్మ ఆధీనములో ఉండును. ఆత్మ ఆదేశించినట్లు నడుచుకొనును.

సృష్టి = తయారు చేయబడినది, సృష్ఠించబడినది.

స్థిత ప్రజ్ఞుడు = ఎప్పుడైతే సర్వ ఆశలు మరియు మనోగతములైన వన్నీ ప్రయత్నపూర్వకముగా వదలి ఆత్మయందే జీవాత్మ తృప్తిబొందుచున్నదో అపుడే వానిని స్థితప్రజ్ఞుడు అని చెప్పవచ్చును.

స్వస్తి = అయిపోయినది.

సంచలనాత్మక రచయత = మంచి చైతన్యము కల్గిన రెండవ ఆత్మ వ్రాయించిన వాడు.

సచ్చిదానందము = సత్తు చిత్తు కలిపిన ఆనందము; సత్‌చిత్ కలిసిన అనుభవము.

సాత్త్వీక సుఖము = మొదట చూచిన విషతుల్యముగా తోచుచూ, పోనుపోను తుదకు అమృత తుల్యముగ కనిపించు ఆత్మ విషయమందు యోచించు బుద్ధికి కల్గు సుఖము.

సాత్త్వీక ధైర్యము = శరీరములోని మనస్సు, ఇంద్రియములు, వాయువుల యొక్క పనులను నిలుపగల్గి వాటిని యోగమందు తగులుకొని నిలుచునట్లు చేయు ధైర్యము.

సాత్త్విక బుద్ధి = ఇది జన్మలు కలిగించునదని, ఇది జన్మరాహిత్మము చేయునదని, ఇది కార్యమని, ఇది అకార్యమనియు ఇది భయాభయములని, ఇది బంధము, ఇది మోక్షము అని వివరించి తెలుపు బుద్ధి.

సాత్త్విక కర్త = సంగరహితుడై కర్తతానన్న అహంకారము లేకుండా ధైర్యము, ఉత్సాహముకల్గి, కార్యఫలములలో నష్టలాభముల మీద కలత చెందనివాడై, పనులు చేయువాడు.

సన్న్యాసము = కర్మ ఫలితమును వదులుకోవడము, కార్యము జరుగక ముందు కార్యమునే వదలుకోవడము సన్న్యాసము కాదు.

సాత్త్విక జ్ఞానము = సర్వ జీవరాశులందు ఉన్న పరమాత్మ నాశరహితమై ఒకే రూపముగా ఉన్నదని, వేరువేరు ఆకారములుగా ఉన్న జీవ శరీరములందు వేరువేరుగా విభజింపబడినదై ఏకముగ ఉన్నదని తెలుపు జ్ఞానము.

సాత్త్విక కర్మ = ఫలాపేక్ష లేక, సంగరహితముగా, ప్రేమ ద్వేషములు లేకుండా చేయు నియత కర్మ.

## హ

హ = చేయువాడు.

హర్షము = సంతోషము.

హర్షి = సంతోషించువాడు.

హర = నాశనము కల్గించువాడు.

హజ్ = జీవితములో పుణ్యక్షేత్రము యొక్క యాత్ర చేయడము.

హేతువాదము = ఒక విషయమును కారణబద్ధముగా తెలుసుకొను నిమిత్తము ప్రశ్నించి అడగడము.

హరి = పాలన చేయువాడు.

హత్య = ఒక శరీరము ఇంకొకరి జోక్యము లేకుండా తన్ను తాను చంపుకోవడము. (తన శరీర మరణమునకు తానే కారణమైనప్పుడు) ఇది శాస్త్రబద్ధమైనది.

హృదయము = మెదడు నుండి వ్యాపించిన బ్రహ్మనాడి. (గుండె కాదు)

హృది = ఆత్మ.

హృదయము = హృదయము అనగా మనిషి శరీరములోపల వెన్నెముకలోనున్న బ్రహ్మనాడి.

హితబోధ = దేవుని ధర్మములతో కూడిన జ్ఞానమును బోధించుట. (మతబోధకాదు).

హారతి = అయిపోవునది.

హేతువాదము = వాస్తవ కారణమును గూర్చి అడగడము.

హేతువు = కారణము (కార్యము జరుగుటకు) కర్మ.

## ళ

ళయము = నాశనము.

# క్ష, అ

| | | |
|---|---|---|
| క్షూద్రులు | = | క్షుద్రములు చేయువారు. |
| క్షుద్రము | = | నీచము, నీచమైనవారు, అంటరానివారు. |
| క్షత్రియులు | = | క్షాత్రముగలవారు. |
| క్షాత్రము | = | పౌరుషము. |
| క్షేత్రము | = | శరీరము. |
| క్షేత్రజ్ఞుడు | = | శరీరమునందు గల ఆత్మ. |
| క్షరుడు | = | నాశనమగువాడు (జీవాత్మ) సర్వ జీవరాశుల యందు కలవాడు. |
| క్షయము | = | నాశనము. |
| క్ష | = | నాశనము. |
| క్షత్రము | = | గొడుగు లేక నాశనము. |





**ఒక విషయమును సమర్థించుటకు శాస్త్రము ఎంత అవసరమో, అట్లే ఒక విషయమును ఖండించుటకు శాస్త్రము అంతే అవసరమగును.**



**అసత్యమును వేయిమంది చెప్పినా అది సత్యము కాదు,**
**సత్యమును వేయిమంది కాదనినా అది అసత్యము కాదు.**



# హిందూ రక్షణా! హిందూ భక్షణా!!

## భగవద్గీతయే చదవనివాడు హిందూ రక్షకుడా?

## హిందూ ధర్మమే తెలియనివారు హిందూ రక్షకులా?

హిందువులు నేడు కులాలుగా చీల్చబడి, అందులో హెచ్చుతగ్గు కులములుగా వర్ణించబడియున్నారు అనుట అందరికీ తెలిసిన సత్యమే. దేవుడు మనుషులందరినీ సమానముగా పుట్టించితే కొందరు మనుషులు తమ స్వార్థ బుద్ధితో హిందూ (ఇందూ) సమాజమును ముక్కలు ముక్కలుగా చీల్చి బలహీనపరచి హిందూసమాజమునకంతటికీ తామే గొప్పవారమనీ, తాము చెప్పినట్లే అందరూ విని అన్ని కార్యములు చేసుకోవాలనీ ప్రచారము చేసుకొన్నారు. ఎన్నో కులములుగా యున్న హిందూ సమాజములో తమ కులమే అగ్రకులమని చెప్పుకోవడమే కాకుండా, ఇతర కులముల వారందరికీ తామే మార్గదర్శకులమనీ, గురువులమనీ ప్రకటించుకొన్నారు. భవిష్యత్తులో తమకు ఎవరూ అడ్డురాకుండునట్లు, అన్ని కులములను అంటరాని కులములను చేసి, హిందూ సమాజమునకు తీరని అన్యాయము చేశారు. అంతటితో ఆగక నేటికినీ హిందూ సమాజ రక్షకులుగా చెప్పుకొనుచూ, హిందూ సమాజమును సర్వనాశనము చేయుచూ, హిందూ సమాజము ఇతర మతములుగా మారిపోవుటకు మొదటి కారకులగుచున్నారు. అటువంటి వారు హిందూ సమాజమునకు చీడ పురుగులుగాయున్నా, మిగతా కులముల వారందరూ వారి నిజ స్వరూపమును తెలియక వారు చెప్పినట్లే వినుట వలన, హిందూ సమాజమును పూర్తిగా అజ్ఞాన దిశవైపుకు, అధర్మ మార్గమువైపుకు మళ్ళించి, ప్రజలకు ఏమాత్రము దైవజ్ఞానమును తెలియకుండా చేసి, తాము చెప్పునదే దైవబోధయని నమ్మించారు.

అటువంటి స్థితిలో నేడు త్రైత సిద్ధాంతకర్తగా ఆచార్య ప్రబోధానంద యోగీశ్వరులవారు అజ్ఞాన దిశవైపు నిలిచి పోయిన హిందూసమాజమును సరియైన దారిలో పెట్టుటకు, భగవద్గీతలో పురుషోత్తమప్రాప్తి యోగమను అధ్యాయమున బోధింపబడిన క్షర, అక్షర, పురుషోత్తమ అను ముగ్గురు పురుషుల విషయమును త్రైత సిద్ధాంతము అను పేరుతో ప్రతిపాదించి దైవజ్ఞానమును అందరికీ అర్థమగులాగున గ్రంథరూపములో వ్రాయడము, బోధించడము జరుగుచున్నది. దానివలన నేడు ప్రజలు అసలైన జ్ఞానము తెలియుచున్నదని సంతోషపడుచున్నారు. అగ్రకులముగానున్న వారిలో కూడా ఎందరో తమ అజ్ఞాన చీకటులను వదలి, ఇంతవరకూ తమకు తెలియనిజ్ఞానము యోగీశ్వరుల ద్వారా ఇప్పుడు తెలియుచున్నదని సంతోషపడి శిష్యులుగా చేరిపోవుచున్నారు. అయితే అగ్రకులములో కొందరు మాత్రము యోగీశ్వరులు తెలియజేయు జ్ఞాన విషయములను చూచి ఈ జ్ఞానము వలన ప్రజలు జ్ఞానములో చైతన్యులై, జ్ఞానము తెలియని తమను గౌరవించరని భావించి, దానివలన సమాజము మీద తమ ఆధిపత్యము లేకుండా పోవునని తలచి, యోగీశ్వరులు తెలుపుచున్న త్రైత సిద్ధాంతము గానీ, త్రైత సిద్ధాంత భగవద్గీతగానీ హిందువుల జ్ఞానమే కాదనీ, అది క్రైస్తవ మతమునకు సంబంధించినదనీ, దానిని ఎవరూ చదవకూడదని ప్రచారము చేయను మొదలుపెట్టారు. అంతేకాక తాము హిందూధర్మరక్షకులమని, కొంత రాజకీయరంగు పూసుకొని, మా జ్ఞాన ప్రచారమునకు అక్కడక్కడ అడ్డుపడడము జరుగుచున్నది. తమ మాట విను ఇతర కులముల వారికి కూడా ప్రబోధానందయోగీశ్వరులు చెప్పు జ్ఞానము హిందూ జ్ఞానము కాదు, క్రైస్తవుల జ్ఞానమని హిందువుల ముసుగులో క్రైస్తవ మత ప్రచారము చేయుచున్నారని చెప్పడమేకాక,

అటువంటివారిని ప్రేరేపించి మా ప్రచారమునకు అడ్డు తగులునట్లు చేయుచున్నారు.

యోగీశ్వరులు నెలకొల్పిన హిందూ (ఇందూ) జ్ఞాన వేదిక ఇటువంటి ఆగడాలను కొంతకాలముగా ఓర్పుతో చూడడము జరిగినది. మాలో ఓర్పు నశించి మమ్ములను అన్యమత ప్రచారకులుగా వర్ణించి చెప్పు అగ్రకులము వారిని, వారి అనుచరులను మేము ఎదురుదిరిగి ప్రశ్నించడము జరిగినది. మేము ప్రశ్నించిన ఒక్క ప్రశ్నకు కూడా వారు సరియైన సమాధానము ఇవ్వలేదు. ఆ జవాబులు ఎలా ఉన్నాయో పాఠకులుగా మీరు చూడండి.

**మా ప్రశ్న :-** ఇంతవరకు ఏ హిందువూ చేయని విధముగా ఊరూరు తిరిగి, ఊరులో ఇల్లిల్లూ తిరిగి హిందూ ధర్మములను ప్రచారము చేయుచున్నాము కదా! అటువంటి మమ్ములను మీరు అన్యమత ప్రచారకులుగా ఎందుకు చెప్పుచున్నారు?

**వారి జవాబు :-** హిందూమతములో ఎందరో స్వామీజీలు ఉన్నారు. వారు ఎవరూ ఇల్లిల్లు తిరిగి ప్రచారము చేయలేదు. హిందువులు అట్లు ఎవరూ ప్రచారము చేయరు. క్రైస్తవులయితేనే బజారు బజారు, ఇల్లిల్లూ తిరిగి ప్రచారము చేస్తారు. మీరు హిందువుల ముసుగులో ఇల్లిల్లూ తిరిగి క్రైస్తవమును ప్రచారము చేయుచున్నారు.

**మా ప్రశ్న :-** మేము క్రైస్తవులమయితే భగవద్గీతను ఎందుకు ప్రచారము చేస్తాము?

**వారి జవాబు :-** మీరు ప్రచారము చేయునది త్రైత సిద్ధాంత భగవద్గీత. అది క్రైస్తవులది. బైబిలుకే మీరు అలా పేరు పెట్టారు.

**మా ప్రశ్న :-** క్రైస్తవులు తమను క్రైస్తవులుగానే చెప్పుకుంటారు. అలాగే బైబిలును బైబిలుగానే చెప్పుకొంటారు. వారి ప్రచారము క్రైస్తవము, బైబిలు అయినప్పుడు అదే పేరుమీద ప్రచారము చేస్తారు తప్ప హిందువులుగా భగవద్గీత పేరుతో ఎందుకు ప్రచారము చేస్తారు? ఇంతవరకు అట్లు ఎక్కడా జరుగలేదు. ఏ మతమువారు ఆ మతము పేరు చెప్పుకొంటారు గానీ ఇతర మతముపేరు చెప్పరు. అంతెందుకు మీరు మా భగవద్గీతను తెరచి చూచారా? అందులో భగవద్గీత శ్లోకములున్నాయా? బైబిలు వాక్యము లున్నాయా?

**వారి జవాబు :-** త్రైత సిద్ధాంతమని యున్నది కదా! త్రైతము అంటే త్రిత్వము అని త్రినిటి అని మాకు బాగా తెలుసు.

**మా ప్రశ్న :-** హిందూ ధర్మములలో అద్వైత సిద్ధాంతమును ఆదిశంకరా చార్యుడు ప్రతిపాదించాడు. విశిష్టాద్వైతమును రామానుజాచార్యులు ప్రతిపాదించాడు, ద్వైతమును మధ్వాచార్యులు ప్రకటించాడు. ఇప్పుడు ఆచార్య ప్రబోధానంద యోగీశ్వరులు త్రైత సిద్ధాంతమును ప్రతిపాదించాడు. సిద్ధాంతకర్తలు, సిద్ధాంతములు వేరయినా అందరూ హిందువులని మీరు ఎందుకు అనుకోలేదు?

**వారి జవాబు :-** మీ త్రైతసిద్ధాంత భగవద్గీతలో యజ్ఞములను చేయకూడదని వ్రాశారు కదా! నిజముగా భగవద్గీతలో అలా లేదు కదా!

**మా ప్రశ్న :-** మీరు హిందువులలో ముఖ్యులుగా వుండి అంత మూర్ఖముగా మాట్లాడితే ఎలా? ప్రపంచమునకంతటికీ ఒకే భగవద్గీతయుంటుంది గానీ, మీ భగవద్గీత, మా భగవద్గీతయని వేరుగా ఉండదు. భగవద్గీతకు వివరము ఒక్కొక్కరు ఒక్కొక్క విధముగా వారికి అర్థమయినట్లు చెప్పియుండవచ్చును

గానీ, అందరికీ భగవద్గీత మూల గ్రంథమొక్కటేనని గుర్తుంచుకోండి. త్రైత సిద్ధాంత భగవద్గీత అన్నిటికంటే సరియైన భావముతో యున్నదని చదివిన జ్ఞానులందరూ పొగడుచూయుంటే, మీ కులములో ఎందరో ప్రశంసించు చూయుంటే, మీకు కొందరికి మాత్రము వ్యతిరేఖముగా కనిపించిందనడము అసూయతోనే అని మాకు అర్థమగుచున్నది. యజ్ఞములు చేయవద్దని మేము ఎక్కడా చెప్పలేదు. యజ్ఞముల వలన పుణ్యము వస్తుంది, స్వర్గము వస్తుంది అని చెప్పాము. యజ్ఞముల వలన మోక్షము రాదు, దేవుడు తెలియడని చెప్పాము. అంతెందుకు మీరు మేము అన్ని కులములకంటే స్వచ్ఛమయిన హిందువులమని చెప్పుకొంటున్నారు కదా! భగవద్గీతలో చెప్పిన ఒక్క హిందూ ధర్మమును చెప్పండి.

**వారి జవాబు :-** అవన్నీ మాటలు వద్దు... మీరు హిందువులు కాదు.

**మా ప్రశ్న :-** మొండిగా మాట్లాడవద్దండి మీరు అగ్రకులమువారమని ఇష్టమొచ్చినట్లు మాట్లాడకండి. మేము హిందువులము కాము అనుటకు ఆధారము ఏమైనా చూపగలరా? మా కథ అట్లుంచి మీరు సరియైన హిందువులే అయితే భగవద్గీతలో విశ్వరూప సందర్శనయోగమను అధ్యాయములో 48వ శ్లోకములోనూ, 53వ శ్లోకములోనూ భగవంతుడు ఏమి చెప్పాడో మీరే చెప్పండి.

**వారి జవాబు :-** మేము ఇంతవరకు భగవద్గీత చదువలేదు. మీకు కావలసి వస్తే సంపూర్ణానందస్వామితో చెప్పిస్తాము.

**మా ప్రశ్న :-** కనీసము భగవద్గీతను కూడా చదువని మీరు యోగీశ్వరులయిన ప్రబోధానందస్వామిని దూషించడము మంచిదా? ఒక్క హిందూ ధర్మమును కూడా తెలియని మీరు హిందూ ధర్మ రక్షకులమని చెప్పడము మంచిదా?

యోగీశ్వరుల వారు వ్రాసిన ఒక్క గ్రంథము కూడా చదువకుండ మేము తప్ప పూజ్యులుగా, గురువులుగా ఎవరూ ఉండకూడదను అసూయతో ఇలాగ మాట్లాడితే దేవుడు ఓర్చుకోడని చెప్పుచున్నాము.

**వారి జవాబు :-** హిందూ మతములో ఎందరో దేవుళ్ళున్నారు. శివుడు దేవుడే, శివుని కొడుకు గణపతి దేవుడే, రాముడు దేవుడే, రాముని సేవకుడు ఆంజనేయుడు దేవుడే. అలాంటి హిందూ మతములో దేవుడు ఒక్కడే అని చెప్పడము మీది తప్పు కాదా?

**మా మాట :-** మేము మతమును గురించి చెప్పలేదు. హిందూ మతములో ఎందరో దేవుళ్ళుండడము నిజమే, అయితే హిందూ జ్ఞానములో, హిందూ ధర్మము ప్రకారము విశ్వమునకంతటికి ఒకే దేవుడని చెప్పాము. భగవద్గీతలో దేవుడు చెప్పినదే చెప్పాము తప్ప మేము దేవతలను గురించి లేరని చెప్పలేదే! దేవతలకందరికీ అధిపతియైన దేవుడు ఒక్కడున్నాడని, ఆయనే దేవదేవుడనీ, అతనిని ఆరాధించమని చెప్పాము.

**వారి జవాబు :-** మీరు రాముని పేరు చెప్పరు, శివుని పేరు చెప్పరు, వినాయకుని పేరు చెప్పరు. ఎవరి పేరూ చెప్పకుండా దేవుడు అనీ, సృష్టికర్తయనీ అనేకమార్లు పేర్కొన్నారు. దేవుడు అను పదమునుగానీ, సృష్టికర్తయను పదమునుగానీ క్రైస్తవులే వాడుతారు. హిందువులు వాడరు. అందువలన మిమ్ములను హిందువులు కాదు క్రైస్తవులు అంటున్నాము.

**మా ప్రశ్న :-** క్రైస్తవ మతము పుట్టి రెండువేల సంవత్సరములయినది. సృష్టిపుట్టి ఎన్ని కోట్ల సంవత్సరములయినదో ఎవరూ చెప్పలేరు. సృష్ట్యాది నుండి సృష్టికర్త అను పదమును దేవుడు అను పదమును హిందూ సమాజము వాడుతూనే యున్నది. మొదటినుండి హిందూసమాజములో

యున్న దేవుడు, సృష్టికర్త అను పేర్లను హిందువులు క్రైస్తవులకేమయినా లీజుకిచ్చారా? లేక పూర్తిగా వారికే అమ్మేశారా? అని అడుగుచున్నాము. సృష్టికర్త అనిగానీ, దేవుడు అనిగానీ హిందువులయినవారు అనకూడదని ఎక్కడయినా ఉన్నదా అని అడుగుచున్నాము?

**వారి జవాబు :-** మీరు హిందూమతమును కాకుండా అన్యమతమును బోధించుచున్నారనుటకు, మిమ్ములను మీరు హిందువులుగా చెప్పుకో లేదు. హిందువులుగా కాకుండా ఇందువులుగా చెప్పుకొంటున్నారు. అటువంటప్పుడు మీరు హిందూమతమును చీల్చినట్లు కాదా! ప్రత్యేకించి ఇందూ మతము అను దానిని ప్రచారము చేసినట్లు కాదా! మీరు హిందువులే అయినప్పుడు మీ గ్రంథములలోగానీ, మీ బోధలలో గానీ ప్రత్యేకించి ఇందువులు అని ఎందుకు చెప్పుచున్నారు?

**మా మాట :-** మేము సూటిగా ఒక ప్రశ్నను అడుగుతాము జవాబు చెప్పండి. హిందువు, ఇందువు అను పదములో కొద్దిపాటి శబ్దము తప్ప ఏమి తేడాయుందో మీరే చెప్పండి. తెలుగుభాషను వ్రాసే వారందరూ హిరణ్యకశ్యపున్ని చంపినది నరశింహస్వామి అని చెప్పుచుందురు అలాగే వ్రాయుచుందురు. ప్రస్తుతకాలములో నరశింహులు అని పేరున్నవాడు కూడా వాని పేరును నరశింహులు అని వ్రాయడము అందరికీ తెలుసు. అయితే ఆ మాట తప్పు అలా వ్రాయకూడదు దానిని **నరసింహ** అని వ్రాయవలెను అని చెప్పుచున్నాము. అడవిలో మృగరాజును
అని అంటాము తప్ప అని అనము అనికూడ చెప్పుచున్నాము. 'సింహము' అంటే అర్థమున్నది గానీ, 'శింహము' అంటే అర్థము లేదు అని కూడా చెప్పాము. అలా ఉన్నది ఉన్నట్లు చెప్పితే ఇందువు అనే

దానికి అర్థమున్నదిగానీ హిందువు అనే దానికి అర్థములేదు అని చెప్పాము. సృష్ట్యాదిలో పుట్టినది ఇందూ సమాజమనీ, అది మధ్యలో పేరుమారి దృష్ఠి జిష్ఠి అయినట్లు ఇందూ అను శబ్ధము హిందూ అని పలుకబడుచున్నదని చెప్పాము. ఇందూ పదము ఎందుకు వాడాలి హిందూ పదమును ఎందుకు వాడకూడదని కూడా వివరముగా మా గ్రంథములలో గలదు. ఉన్న సత్యము మీకు తెలిసినా మీరు మాకంటే పెద్ద ఎవరూ ఉండకూడదను అసూయతో మాట్లాడుచున్నారు.

అగ్రకులములో ఎందరో పెద్దలు మా జ్ఞానమును తెలిసి సంతోషించుచుండగా, కొందరు మాత్రము వీధి రౌడీలలాగా తంతాము, పొడుస్తాము, కాలుస్తాము మీరు ప్రచారము చేయవద్దండని చెప్పడము మంచిది కాదు. మా గ్రంథములు ఏదీ చదువకుండా మాట్లాడడమూ, మేము చెప్పిన మాటలను వినకుండా ఇవన్నీ డ్రామాలు, నాటకాలు అనడము మంచిది కాదు. మీరు ఎవరైనా మా గ్రంథములలో ఇతర మతములను ప్రచారము చేసినట్లుగానీ, ఫలానా మతములోనికి చేరమని చెప్పినట్లుగానీ ఉంటే నిరూపణ చేయండి, అలా నిరూపించినవారికి ఇందూ జ్ఞానవేదిక తరపున పది లక్షల రూపాయలను ఇవ్వగలము. నిరూపించ లేకపోతే మీరు లక్ష రూపాయలు ఏ ఊరిలో శ్రీకృష్ణుని గుడికయినా ఇవ్వవలెను. ఈ షరతుకు ఎవరైనా ముందుకు వస్తారా? అని అడుగు చున్నాము.

ఇట్లు

**ఇందూ జ్ఞానవేదిక**



# చరిత్రలో జరిగిన అన్యాయము

# హిందువులలో జరుగుచున్న యదార్థము

నాలుగువందల సంవత్సరముల క్రిందట ఆధ్యాత్మిక రంగములో మెరిసిన వజ్రము వేమనయోగి. ఆధ్యాత్మికమను పాలను చిలికి దైవజ్ఞానము అనే వెన్నను తీసి ఇచ్చినవాడు వేమన. వేమన తన పద్యములలో చెప్పిన ఒక్కొక్క జ్ఞాన విషయము విపులముగా వ్రాసుకొంటే ఒక్కొక్క గ్రంథము కాగలదు. వేమన స్వచ్ఛమైన తెలుగు భాషలో పద్యమును వ్రాసి చెప్పాడు. సంస్కృతము జోలికి పోలేదు. ఒక ప్రక్క పద్యములు వ్రాసి కవిగా కనిపించినా, ఒక ప్రక్క అంతు తెలియని ఆధ్యాత్మికవేత్త వేమనయోగి. అయితే ఆయన పుట్టినది రెడ్డి కులమున. చరిత్రలో మాకంటే ఎవరూ పెద్దగా ప్రశంసింపబడకూడదని గర్వములోయున్న అగ్రకులములోని కొందరు పనిగట్టుకొని వేమన యోగిని పిచ్చివానిగా జమకట్టి, అతను చెప్పింది జ్ఞానమేకాదని ప్రజలలో ప్రచారము చేశారు. పిచ్చివాని మాటలు పిచ్చివారే వింటారు అని హేళనగా మాట్లాడడము జరిగినది. అనేక కులములుగాయున్న హిందువులకు జ్ఞాన విషయములో పరిచయము లేనిదానివలన, అగ్రకులము వారు వేమన చెప్పినది జ్ఞానమే కాదనడము వలన, వేమన తన జ్ఞానమునకు తగినట్లుగా ప్రకాశింప లేకపోయాడు. తాము అగ్రకులము వారమనీ, మిగతా వారందరూ తగ్గు కులము వారనీ విభజించి, తాము చెప్పినట్లు వినవలెననీ, అట్లు వింటేనే మిగతా కులముల వారందరూ సుఖముగా బ్రతుకగలరనీ, అగ్ర కులమువారు ప్రచారము చేసుకొన్నారు. అలా తమను తాము గొప్పగా ప్రకటించుకోవడమేకాక

హిందువుల ఇళ్ళలో జరుగు ప్రతి మంచి పనికీ, చెడు పనికీ, చావుకూ పుట్టుకకూ, పెళ్ళికీ పేరంటానికీ ప్రతి కార్యమునకూ తాము చెప్పునట్లు చేయాలనీ, తాము నిర్ణయించు కాలములోనే చేయాలనీ, అట్లు చేయకపోతే నష్టము, కష్టము కలుగుతుందని భయపెట్టడము వలన, భయముతో జ్ఞానము తెలియని మిగతా కులముల వారందరూ వారు చెప్పిన దానిని నమ్మడము జరిగినది. ఈ విధముగా హిందూమతములో అగ్రకులము వారు భయము అను బ్లాక్‌మెయిల్ చేసి, తగ్గు కులము వారందరినీ తమమాట వినునట్లు చేసుకొన్నారు. ఆనాటినుండి హిందూ సమాజమును మోసము చేస్తూ ఎవరికీ హిందూ జ్ఞానమును తెలియకుండా చేసి, తాము హిందూ సమాజమును అనేక పేర్లతో దోచుకొంటూ బ్రతకడమే కాక, మిగతా కులములలో ఎవరు జ్ఞానులుగా పుట్టినా, వారిని హేళన చేయడమూ, అజ్ఞానిగా వర్ణించడమూ జరిగినది.

చరిత్రలో నాలుగు వందల సంవత్సరముల క్రితము వచ్చిన వేమనను పిచ్చివానిగా వర్ణించి శాస్త్రము తెలియనివాడని వర్ణించారు. తర్వాత మూడు వందలయాభై సంవత్సరముల క్రిందట వచ్చిన పోతులూరు వీరబ్రహ్మముగారు గొప్ప జ్ఞానిగా తయారై, భవిష్యత్తు కాలములో జరుగు సంఘటనలను ముందే తెలియజేసి గొప్ప కాలజ్ఞానమునే వ్రాశాడు. ఆయన వ్రాసిన భవిష్యత్తు కాలక్రమమున నేటికినీ జరుగుచూనేయున్నది. అంతటి గొప్ప జ్ఞాని అయిన వీరబ్రహ్మముగారు అగ్రకులమువాడు కాకపోవుట వలన, విశ్వకర్మ (ఆచారుల) కులమున పుట్టుట వలన, అగ్రకులము వారు బ్రహ్మము గారు బ్రతికియున్న కాలములోనే, తమ ఊరిలోనికి రాకుండా, ఆయన జ్ఞానమును ప్రచారము చేయకుండా అడ్డుకొన్నారు. ఆ రోజు ఇతరులు జ్ఞానులు కాకూడదను అసూయ అను గుణముతోనూ, మేమే తెలిసిన

వారమను గర్వముతోనూ ఆ పని చేశారు. హిందూ సమాజములో ఇటువంటి వారుండుట వలన విసిగిపోయిన హిందువులు హిందూ మతమును వీడి ఇతర మతములోనికి పోవుచున్నారు. ఇందూమతములో దేవునికి గుడికి అంటరాని వారిగా ఉండలేని వారందరూ కొందరు జ్ఞానము కొరకు, కొందరు కులవివక్ష లేని స్వతంత్రము కొరకు మతమును మారజొచ్చారు. ఈ విధముగా హిందూమతములోని వారు ఇతర మతములోనికి పోవుటకు మొదటి కారకులు హిందూమతములోని అగ్రకులములవారేనని అనుమానము లేకుండా చెప్పవచ్చును.

తమ వలననే హిందువులు ఇతర మతములలోనికి పోవుచున్నారని అగ్రకులమువారికి కూడా తెలుసు. అయితే తమ తప్పును ఎవరూ గుర్తించనట్లు తాము హిందూమతమును ఉద్ధరించువారిగా, హిందూధర్మ రక్షకులుగా వర్ణించుకొని హిందూ ధర్మ భక్షకులుగా నేటికినీ సమాజములో కొనసాగుచున్నారు. వారిని హిందూ ధర్మ భక్షకులు, హిందూ ధర్మ నాశకులు అని చెప్పుటకు అనేక ఆధారములు గలవు. అటువంటి వాటిని పరిశీలించితే, హిందువులలోని మిగతా కులమువారివద్ద భగవద్గీతను బోధించు కృష్ణుడు అర్జునుడు యున్న చిత్రపటము (ఫోటో) యుంటే దానిని ఇంటిలో ఉంచుకోకూడదనీ, ఆ పటము ఇంటిలో ఉంటే ఇంటిలో కూడా యుద్ధాలు వస్తాయనీ, అనేక కష్టాలు వచ్చి పాండవులు అరణ్యవాసము పోయినట్లు బాధపడవలసివస్తుందనీ అగ్ర కులమువారు నేటికినీ చెప్పుచునే యున్నారు. అటువంటి భగవద్గీత ఫోటోలను గుడులలో ఉంచవలెననీ లేకపోతే ఏటిలోని నదీ ప్రవాహములో పారవేయాలనీ చెప్పడము, చేయించడము కూడా జరిగినది. అంతేకాక భగవద్గీతను ఇంటిలో ఉంచు కోకూడదని భగవద్గీతను ఎవరూ చదువకూడదనీ, చదివితే కష్టాలు

వస్తాయనీ, భగవద్గీతను ఎవరి ఇంటిలోనూ లేకుండునట్లు చేయుచున్నారు. భగవద్గీత అర్జునునికి యుద్ధరంగములో యుద్ధము చేయుటకు చెప్పినది, అందువలన చదువకూడదు, చదివితే చదివినవారు కూడా అనేక తగాదాల లోనూ, కోర్టు వ్యవహారములలోనూ చిక్కుకోవలసి వస్తుందని చెప్పడము జరుగుచున్నది. ఇంకనూ హిందువులకు వేదములు ముఖ్యమైనవనీ వాటిని అన్ని కులముల వారు చదువకూడదనీ, వేదములను తామే చదువవలెననీ చెప్పడము కూడా జరుగుచున్నది. ఈ విధముగా భగవద్గీతకు వ్యతిరేఖముగా మాట్లాడువారు హిందూ సమాజమునకు చీడపురుగులుకాక ఏమవుతారో మీరే ఆలోచించండి.

ఇదంతయూ గతములో జరిగిన విషయములు, అవి చాలక ప్రస్తుత కాలములో వీరి ఓర్వలేనితనము, మేమేపెద్ద అను గర్వము ఎలాగుందో చూడండి. వేమనయోగిని, పోతులూరి వీరబ్రహ్మముగారిని అగ్రకులము వారు ఎంత హేళన చేసినా వేమనయోగిని రెడ్డి కులస్థులు వేమారెడ్లుగా గుర్రముల నెక్కి ప్రచారము చేయుట వలన, వీరబ్రహ్మముగారిని విశ్వకర్మ (ఆచారి) కులమువారు కాలజ్ఞానమును ప్రచారము చేయుట వలన, వేమన సంఘములు, విశ్వకర్మ సంఘములు తయారై వేమనను, బ్రహ్మముగారిని ప్రచారము చేయుట వలన, కొంతమంది ప్రజలకు వేమనయోగి పద్యములు, వీరబ్రహ్మము గారి కాలజ్ఞానము కొంతవరకు తెలియును. వేమనయోగి ఆ కాలములోనే తన పద్యములలో అగ్రకులమువారు చేయు తప్పులను ఎండబెట్టడము జరిగినది. వీరబ్రహ్మముగారి చరిత్రలో కూడా బ్రహ్మము గారికి అగ్రకులము వారు చేసిన ఆటంకములను వ్రాయడము జరిగినది.

వీరబ్రహ్మముగారు తన కాలజ్ఞానములో ప్రబోధాశ్రమము ఉన్నతమైన జ్ఞానముకలది అని మూడువందల యాభై సంవత్సరములప్పుడే

వ్రాసియుంచాడు. కాలజ్ఞానములో ప్రబోధాశ్రమము యొక్క పేరుండడము ఈ మధ్యన ఐదు సంవత్సరముల క్రితము మాకు తెలిసినది. తర్వాత బ్రహ్మము గారు వ్రాసిన కాలజ్ఞానములో ప్రబోధాశ్రమమునకు, ప్రబోధానంద యోగీశ్వరులకు సంబంధించిన చాలా విషయములు వ్రాసినట్లు తెలిసినది. ఎంతో గొప్ప జ్ఞాని, కాలజ్ఞాని అయిన పోతులూరి వీరబ్రహ్మముగారు ప్రబోధాశ్రమాధిపతియైన ప్రబోధానందయోగీశ్వరుల వారిని గొప్పగా చెప్పుచూ "ప్రబోధాశ్రమము వారు శయనాధిపతి గుణములు కల్గియున్నారు. శయనాధిపతియే ఆనందగురువు. ఆనంద గురువే నాకు గురువు, మీకు గురువు" అని వ్రాయడము జరిగినది. ప్రబోధానందయోగీశ్వరుల జ్ఞానమేమిటో ఎంత శక్తివంతమైనదో జ్ఞాన జిజ్ఞాసులకు కూడా తెలియుచున్నది. ఎందరో జ్ఞానులయిన వారు యోగీశ్వరులు చెప్పుచున్న జ్ఞానము ఎంతో గొప్పదని ప్రశంసించుచున్నారు. బ్రహ్మముగారే స్వయముగా తన గురువుగా చెప్పుకొన్న వ్యక్తి ఎంతటి వాడయివుంటాడో మనము కూడా ఆలోచించ వలసియున్నది. అయినా ప్రబోధానందయోగీశ్వరుల వారు ఒక్క దైవ జ్ఞానములో తప్ప మిగతా అన్నిటిలో సాధారణ వ్యక్తిగానే కనిపిస్తాడు. ఎదురుగా చూస్తే ఇతనికి జ్ఞానము తెలియునా! అన్నట్లు కనిపించినా, అవును ఆయన ఎవరికీ తెలియని గొప్పవాడే అన్నట్లు ఆయన వ్రాసిన గ్రంథములే గొప్ప శక్తులుగా నిరూపించుకొన్నాయి. ఒక గ్రంథము దగ్గరకు వస్తూనే కొందరిలో మార్పు కనిపించడమూ, కొందరు గ్రంథమును చదివిన వెంటనే అంతవరకు నయముగాని రోగములు పోవడము జరుగుచున్నది.

పైకి కనిపించని శక్తి యోగీశ్వరులలో నిక్షిప్తమైయుండుట బయటికి కనిపించకపోయినా ఆయన చెంతకు పోయినవారికి దేహములో నయము కాని, మందులులేని ఎయిడ్స్, క్యాన్సర్, డెంగీజ్వరములు సహితము

శాంతించి పోవడము జరుగుచుండుట వలన యోగీశ్వరులు ఎంతటివారో ఎవరికయినా సులభముగా అర్థమయిపోగలదు.

వీరబ్రహ్మముగారు తన కాలజ్ఞానములో ఆనంద యోగిని దూషించిన వారు చాలా ఇబ్బందుల పాలవుతారని వ్రాయడము జరిగినది. అలాగే ఆయనను గానీ, ఆయన గ్రంథములనుగానీ దూషించినవారు ఇంతవరకు ఎవరూ సురక్షితముగాలేరు. తెలియని రోగములతో, అర్థముకాని బాధలతో కొందరుండగా, కొందరు చిత్రహింసలపాలై చనిపోవడము జరిగినది. అలా ఎందుకు జరుగుచున్నదో తెలియనివారు, పాపమును మూటగట్టుకొనుటకు యోగీశ్వరుల వారి జ్ఞానమునకు అక్కడక్కడ ఆటంకములను కలుగజేయుచున్నారు. హిందూమతములో ఆదిశంకరాచార్యులు అద్వైత సిద్ధాంతమును ప్రతిపాదించాడు. తర్వాత కొంతకాలమునకు విశిష్టాద్వైత సిద్ధాంతమును రామానుజాచార్యులు ప్రతిపాదించాడు. మరికొంత కాలమునకు ద్వైత సిద్ధాంతమును మధ్వాచార్యులు ప్రకటించాడు. వీరు ముగ్గురూ అగ్రకులము వారు కావడము విశేషము. గత ముప్ఫైఆరు సంవత్సరముల నుండి త్రైత సిద్ధాంతమును ఆచార్య ప్రబోధానంద యోగీశ్వరులవారు, ప్రకటించి ఆ సిద్ధాంతమునే ప్రచారము చేయుచూ త్రైత సిద్ధాంతము ప్రకారము భగవద్గీతను వివరించి వ్రాయడము జరిగినది. హిందూమతములోని సిద్ధాంతముల వివరము తెలియని ప్రజలకు, అగ్రకులమువారు "త్రైతము అంటే క్రైస్తవులకు సంబంధించినదనీ, త్రైత సిద్ధాంత భగవద్గీతయని పైకి చెప్పుచూ లోలోపల క్రైస్తవ మతమును బోధించుచున్నారని" యోగీశ్వరులకు, యోగీశ్వరుల జ్ఞానమునకు వ్యతిరేఖముగా చెప్పడము జరిగినది. హిందుత్వమును ఒక వైపు సర్వ నాశనము చేయుచున్న అగ్రకులములవారు హిందూమతమును కాపాడువారి

వలె నటించుచూ యోగీశ్వరుల జ్ఞానమునకు కొన్నిచోట్ల ఆటంకము కల్గించడము జరిగినది. మూడుచోట్ల అన్యమతప్రచారమని భగవద్గీతను ప్రచారము చేయు యోగీశ్వరుల శిష్యుల మీద కేసులు పెట్టడడము కూడా జరిగినది. కొన్నిచోట్ల ప్రత్యక్ష దాడులకు దిగడము జరిగినది. అయినా ప్రబోధానంద శిష్యులు అన్నిటికీ ఓర్పు వహించి జ్ఞానప్రచారము చేయు చున్నారు. ఈ మధ్యకాలములో నల్గొండ జిల్లా భువనగిరిలో దేవేంద్ర అను మా సంఘ సభ్యునిమీద అన్యమత ప్రచారము చేయుచున్నాడని ఆరోపించి కేసు పెట్టడము జరిగినది. అంతేకాకుండా మా ప్రచార వాహనము భువనగిరిలోనికి పోయినప్పుడు మా ఊరిలో ప్రచారము చేయవద్దని అడ్డుపడి పంపించడము జరిగినది. కరీంనగర్‌లో గోడమీద త్రైత సిద్ధాంత భగవద్గీతను చదవండి అని వ్రాస్తే, అగ్రకులము వారువచ్చి ఇది క్రైస్తవ మతప్రచారము దానిని తుడిపివేయమని చెప్పడము జరిగినది. రెండు రోజుల క్రిందట ఆర్లగడ్డలో ప్రచార వాహనముండగా అక్కడికి ఒక అగ్ర కులస్థుడు వచ్చి ఇది క్రైస్తవ ప్రచారము, ఈ ప్రచారమును నిలిపివేయండని ఘర్షణపడగా ఆ సమయానికి మా గ్రంథములు చదివిన వారు అక్కడుండుట వలన వారే అగ్రకులమువారికి బుద్ధిచెప్పి పంపడము జరిగినది. అక్కడున్న ప్రజలు అనిన మాటలు "ఇది ఎంతో గొప్ప జ్ఞానము. ఇంతకాలానికి గొప్ప జ్ఞానము దొరికిందని మేము సంతోషపడుచుంటే, సమాజాన్ని సర్వనాశనము చేసిన మీరు దీనిని జ్ఞానము కాదంటారా? ఇట్లే మాట్లాడితే ఊరిలో లేకుండా మిమ్ములను మేమే పంపుతాము" అని అనడము జరిగినది. ఈ విధముగా ప్రజలే తిరగబడి బుద్ధిచెప్పు సమయము అన్నిచోట్లా వస్తుంది.

గౌతమబుద్ధుడు జ్ఞానము చెప్పితే అతను అగ్రకులము వాడు కాదని ఆయనది వేరు మతమని ప్రచారము చేశారు. ఆ దినము గౌతముడు హిందువే కదా! తమ ఆధిపత్యము కొరకు హిందూమతమునుండి బుద్ధున్ని చీల్చి అతనిది బౌద్ధమతమని చెప్పి హిందూమతమునుండి వేరు చేశారు. ఈ దినము బౌద్ధమతము విదేశాలలో వ్యాపించియున్నా స్వదేశములో లేకుండా చేసినది అగ్రకులము వారు కాదా! ఈ దినము బుద్ధుడు మావాడే బౌద్ధము హిందూమతమే అని చెప్పుకోలేని పరిస్థితి మనకు ఏర్పడినది. అలాగే ప్రబోధానంద యోగీశ్వరులు చెప్పు త్రైత సిద్ధాంతమును హిందూ మతములోని భాగము కాదనడమూ, త్రైత సిద్ధాంత భగవద్గీతను భగవద్గీతే కాదనడమును ఒకవైపు ప్రజలు గమనిస్తున్నారు. ప్రబోధానంద యోగీశ్వరులు గత 36 సంవత్సరములుగా బోధించుచున్న బోధ హిందుత్వములోనే ఎంతో గొప్పదని అన్ని మతములవారు ఒప్పుకొనుచుండగా, తగ్గుకులము వారని అగ్రకులముచే అనబడినవారందరూ హిందూ (ఇందూ) జ్ఞానమును తెలుసుకొని చైతన్యవంతులై అగ్రకులము వారికి తిరగబడి జ్ఞానము చెప్పు స్థితికి ఎదిగారు. తగ్గుకులము వారిమీద ఆధారపడి బ్రతుకుచున్న అగ్రకులమువారిని తగ్గుకులము వారందరూ ఒక్కమారు వెలివేస్తే, మీతో మాకు సంబంధము వద్దు అంటే ఏమవుతుందో చెప్పనవసరము లేదు. అటువంటి స్థితి రాకుండుటకు మా జ్ఞానమునకు అడ్డురావద్దని అగ్రకులము వారికి మరీమరీ చెప్పుచున్నాము.

ఇట్లు

**ప్రబోధ సేవాసమితి**

